# బైబిలు దర్శిని

# THE BIBLE HANDBOOK

Edited By

G. W. FOOTE & W. P. BALL

## 2. అసంభావ్యాలు

అనువాదం

పెన్మెత్స సుబ్బరాజు

పశ్చిమ గోదావరిజిల్లా హేతువాద సంఘం

పాలకొల్లు - 534 260

# బైబిలు దర్శిని

# THE BIBLE HANDBOOK

Edited By

**G. W. FOOTE & W. P. BALL**

## 2. అసంభావ్యాలు

అనువాదం

పెన్మెత్స సుబ్బరాజు

పశ్చిమ గోదావరిజిల్లా హేతువాద సంఘం

పాలకొల్లు - 534 260

**BYBILUDARSINI - ASAMBHAVYALU**

*Translated by :*
PENMETSA SUBBARAJU

తొలిముద్రణ : అక్టోబరు 1986
ప్రతులు 1000

ప్రతులకు :

చార్వాక ఎంటర్‌ప్రైజస్
పెదగోపురంవద్ద
పాలకొల్లు - 534 260
ప. గోదావరిజిల్లా ఎ. పి.

రావిపూడి వెంకటాద్రి
ఎడిటర్, హేతువాది,
చీరాల - 523 155.

* బైబిలులో మొదటివాక్యంవద్దనుంచే అసంభావ్యాలు ప్రారంభమవుతాయి. అయినా తేలికగా పట్టియిచ్చే అసంభావ్యాలను మాత్రమే ఈ భాగంలో పొందుపరచడం జరిగింది. ప్రతి సందర్భంలోను అసంభావ్యాన్ని తెలియజేసే శీర్షిక ఉంచబడింది.

ప్రచురణ :

పశ్చిమగోదావరిజిల్లా హేతువాద సంఘం
పాలకొల్లు - 534 260

ముద్రణ : నాగార్జున ప్రింటింగ్ అండ్ బైండింగ్ వర్క్సు - తెనాలి.

# బైబిలు దర్శిని

## 2. అసంభావ్యాలు

### భూమికి ఆకారం లేదా ?

భూమి నిరాకారముగాను శూన్యముగాను ఉండెను.... దేవుని ఆత్మ జలములపై అల్లాడు చుండెను. ఆది 1 : 2.

### సూర్యుడు లేకుండానే రాత్రీ, పగలూ ఏర్పడటమేగాక చెట్లు కూడా మొలిచాయి !

దేవుడు - వెలుగు కమ్మని పలుకగా వెలుగు కలిగెను .... దేవుడు వెలుగునకు పగలనియు చీకటికి రాత్రి అనియు పేరు పెట్టెను. అస్తమయమును ఉదయమును కలుగగా ఒక దినమాయెను. ఆది 1 : 3, 5.

భూమి గడ్డిని తమతమ జాతి ప్రకారము విత్తనములిచ్చు చెట్లను, తమతమ జాతి ప్రకారము తమలో విత్తనములుగల ఫల వృక్షములను మొలిపింపగా అది మంచిదని దేవుడు చూచెను. అస్తమయమును ఉదయమును కలుగగా మూడవదినమాయెను. ఆది 1 : 12, 13.

దేవుడు రెండు గొప్ప జ్యోతులను అనగా పగటిని ఏలుటకు పెద్ద జ్యోతిని రాత్రిని ఏలుటకు చిన్న జ్యోతిని నక్షత్రములను చేసెను .... దేవుడు ఆకాశ విశాలమందు వాటినుంచెను .... అస్తమయమును ఉదయమును కలుగగా నాలుగవ దినమాయెను. ఆది 1 : 6 - 19.

### ఆకాశపు పైకప్పుపై జలాశయాలు.

మరియు దేవుడు - జలముల మధ్య నొక విశాలము కలిగి ఆ జలములను ఈ జలములను వేరుపరచుగాకని పలికెను. దేవుడు ఆ విశాలముచేసి విశాలము

క్రింది జలములను విశాలముమీది జలములను వేరు పరుపగా ఆ ప్రకారమాయెను. దేవుడు ఆ విశాలమునకు ఆకాశమని పేరు పెట్టెను. ఆది 1 : 6 - 8.

ఆకాశపు తూములు విప్పబడెను. 7 : 11.

పోతపోసిన అద్దమంత దట్టమైనదగు ఆకాశమును ఆయన వ్యాపింప జేసినట్లు నీవు వ్యాపింప జేయగలవా ? యోబు 37 : 8.

## ఆకాశానికి పునాదులు, స్తంభాలు

పరమండలపు పునాదులు వణకెను. 2 సమూ 22 : 8.

ఆయన గద్దింపగా ఆకాశ విశాల స్తంభములు విస్మయమొంది అదరును. యోబు 26 : 11.

## నీటిలో బ్రతికే చేపలు వగైరాలు ఆకాశంలో విహరించే పక్షులతోపాటు ఒకేసారి సముద్రంలో పుట్టాయి!

దేవుడు జీవము కలిగి చలించు వాటిని జలములు సమృద్ధిగా పుట్టించును గాకనియు, పక్షులు భూమిపైని ఆకాశ విశాలములో ఎగురునుగాకనియు పలికెను.
ఆది 1 : 20.

## తిమింగలాదులు క్షీరదాలకంటె ముందే సృష్టించబడ్డాయి.

దేవుడు జలములలో వాటివాటి జాతి ప్రకారము జలములు సమృద్ధిగా పుట్టించిన మహా మత్స్యములను, జీవము కలిగి చలించు వాటినన్నిటిని, దాని దాని జాతి ప్రకారము రెక్కలు గల ప్రతి పక్షిని సృజించెను....అస్తమయమును ఉదయమును కలుగగా అయిదవ దినమాయెను. ఆది 1 : 21, 23.

దేవుడు—వాటివాటి జాతి ప్రకారము జీవము గల వాటిని, అనగా వాటివాటి జాతి ప్రకారము పశువులను, పురుగులను, అడవి జంతువులను భూమి పుట్టించుగాకని పలికెను....అస్తమయమును ఉదయమును కలుగగా ఆరవదినమాయెను.
ఆది 1 : 24, 31.

క్రూర మృగాలు, విషసర్పాలు, పరాన్న జీవులు, అగ్ని పర్వతాలు మొదలైనవన్నీ చాల మంచివి!

దేవుడు తాను చేసినది యావత్తును చూచినప్పుడు అది చాల మంచిదిగ నుండెను. ఆది 1 : 31.

మాంసాహారులు ఒకప్పుడు ఆకులలములు తినేవా ?

భూమి మీదనుండు జంతువు లన్నిటికిని ఆకాశ పక్షులన్నిటికిని భూమి మీద ప్రాకు సమస్త జీవులకును పచ్చని చెట్లన్నియు ఆహారమగునని పలికెను. ఆ ప్రకారమాయెను. ఆది 1 : 30.

మానవుడు దేవుని స్వరూపమును పోలియున్నాడు (సైన్సు దీనిని తలక్రిందులు చేస్తుంది.)

దేవుడు తన స్వరూపమందు నరుని సృజించెను. దేవుని స్వరూపమందు నరుని సృజించెను. స్త్రీని గాను పురుషునిగాను వారిని సృజించెను. ఆది 1 : 27.

మట్టితో మానవుడి నిర్మాణం

దేవుడైన యెహోవా నేల మంటితో నరుని నిర్మించి వాని నాసికా రంధ్రములలో జీవ వాయువును ఊదగా నరుడు జీవాత్మ అయెను. ఆది 2 : 7.

సైన్సుకు వ్యతిరేకం

అస్తమయమును ఉదయమును కలుగగా ఒక దినమాయెను. ఆది 1 : 5.
దేవుడు తాను చేసిన పని యేడవ దినములోగా సంపూర్తిచేసెను.
ఆది 2 : 2.

(భూమి ఏర్పడడానికి, జీవుల పుట్టుక, పరిణామాలకు వేలాది సంవత్సరాలు పట్టిందని భూగర్భశాస్త్రం చెబుతున్నది)

సర్వశక్తిమంతుడికి అలసట !

ఆరు దినములు యెహోవా భూమ్యాకాశములను సృజించి యేడవ దినమున

పనిమాని విశ్రమించెను. నిర్గ 31 : 17 (ఆది 2 ; 2 కూడ చూడండి)

## ఇంద్రజాలపు చెట్లు

ఆ తోట మధ్య జీవ వృక్షమును, మంచిచెడ్డల తెలివినిచ్చు వృక్షమును నేల నుండి మొలిపించెను. ఆది 2 ; 9.

దేవుడు సమస్త జంతువులను సృష్టించి (స్త్రీ సృష్టించ బడక పూర్వమే) వాటికి పేర్లు పెట్టడానికి, తనకు భాగస్వామిని ఎన్ను కోవడానికి వాటిని ఆదాము వద్దకు రప్పించాడు.

మరియు దేవుడైన యెహోవా-నరుడు ఒంటరిగా నుండుట మంచిదికాదు, వానికి సాటియైనా సహాయమును వాని కొరకు చేయుదుననుకొనెను. దేవుడైన యెహోవా ప్రతి భూజంతువును ప్రతి ఆకాశ పక్షిని నేల నుండి నిర్మించి, ఆదాము వాటికి ఏపేరు పెట్టునో చూచుటకు అతని యొద్దకు వాటిని రప్పించెను. జీవము గల ప్రతి దానికి ఆదాము ఏ పేరు పెట్టెనో ఆ పేరు దానికి కలిగెను. అప్పుడు ఆదాము సమస్త పశువులకును, ఆకాశ పక్షులకును, సమస్త భూజంతువులకును పేరులు పెట్టెను. అయినను ఆదామునకు సాటియైన సహాయము అతనికి లేకపోయెను.

ఆది 2 : 18-20.

## ప్రక్కటెముక కథ

అప్పుడు దేవుడైన యెహోవా ఆదామునకు గాఢ నిద్ర కలుగజేసి అతడు నిద్రించినప్పుడు అతని ప్రక్క-టెముకలలో ఒకదానిని తీసి ఆ చోటును మాంసముతో పూడ్చివేసెను. తరువాత దేవుడైన యెహోవా తాను ఆదాము నుండి తీసిన ప్రక్క-టెముకను స్త్రీనిగా నిర్మించి ఆమెను ఆదాము నొద్దకు తీసికొని వచ్చెను. అప్పుడు ఆదాము ఇట్లనెను-నా యెముకలలో ఒక యెముక, నా మాంసములో మాంసము, ఇది నరుని నుండి తీయబడెను గనుక నారి అనబడును. ఆది 2 : 21-23.

## మాట్లాడే పాము !

దేవుడైన యెహోవా చేసిన సమస్త భూజంతువులలో సర్పము యుక్తి గలదైయుండెను. అది ఆ స్త్రీతో - ఇది నిజమా? ఈ తోట చెట్లలో దేనిఫలము నైనను మీరు తినకూడదని దేవుడు చెప్పెనా? అని అడిగెను. ఆది 3 ; 1.

## మానవుడి పతనం

స్త్రీ ఆ వృక్షము ఆహారమునకు మంచిదియు, కన్నులకు అందమైనదియు, వివేకమిచ్చు రమ్యమైనదియు నై యుండుట చూచినప్పుడు ఆమె దాని ఫలములలో కొన్ని తీసికొని తిని తనతోపాటు తన భర్తకును ఇచ్చెను. అతడు కూడ తినెను.
ఆది 3 : 6.

తీర్పు ఒక్క అపరాధ మూలమున వచ్చినదై మనుష్యుల కందరికిని శిక్షా విధి కలుగుటకు కారణమాయెను. రోమీ 5 : 18.

(ఎవరో ఒక పండు తిన్నందువల్ల మానవజాతి నంతటిని ఎందుకు శిక్షించాలి? ఆ పండు తినేంతవరకు వాళ్ళకు జ్ఞానం కలుగనప్పుడు, మంచిచెడ్డల మధ్య భేదాన్ని అర్థంచేసుకో గల జ్ఞానం లేని రోజుల్లో ఆదాము హవ్వలు ఆ పండు తినడం నేరమెట్లా అవుతుంది. ఆధునిక విజ్ఞానం ప్రకారం మనవుడు కాలం గడుస్తున్నకొద్దీ జ్ఞానవంతుడవుతున్నాడు తప్ప తద్విరుద్ధంగా జరగడం లేదు)

## ఆదాము పాపం చెయ్యకముందు ప్రపంచంలో మరణంలేదు !

మనుష్యుల ద్వారా మరణము వచ్చెను గనుక మనుష్యుని ద్వారానే మృతుల పునరుత్థానమును కలిగెను. 1 కొరిం 15 : 21.

ఒక మనుష్యుని ద్వారా పాపమును పాపముద్వారా మరణమును లోకములో ఏలాగు ప్రవేశించెనో, అలాగుననే మనుష్యులందరు పాపము చేసినందున మరణము అందరికీ సంప్రాప్తమాయెను. రోమీ 5 : 12.

(ఆదాము పండు తినక పూర్వం మాంసాహార జంతువులేవీ ఏ జంతువును చంపకుండా గడ్డితిని బ్రతికాయా? మనిషికంటే ముందే ప్రపంచంలో మరణం వున్నదని భూగర్భశాస్త్రం చూపే రుజువులన్నీ భ్రమలేనా లేక తెలివిగల వాళ్ళని మోసం చేయడానికి పన్నిన పన్నాగమా?)

## నిరాకారుడు, నిర్గుణుడు అయిన దేవుడు నడుస్తాడు, మాట్లాడతాడు

చల్లపూటను ఆదామును అతని భార్యయు తోటలో సంచరించుచున్న దేవుడైన యెహోవా స్వరము విని దేవుడైన యెహోవా ఎదుటికి రాకుండ తోట చెట్ల

మధ్యను దాగుకొనగా దేవుడైన యెహోవా ఆదామును పిలిచి - నీవు ఎక్కడ వున్నా వనెను. అందుకతడు _ నేను తోటలో నీ స్వరము వినినప్పుడు దిగంబరినిగా నుంటిని గనుక భయపడి దాగుకొంటిననెను. ఆది 3 : 8 _ 10.

## తెలివి తక్కువ శాపం

అందుకు దేవుడైన యెహోవా సర్పముతో నీవు దీని చేసినందున పశువు లన్నిటిలోను భూజంతువు లన్నిటిలోను నీవు శపించబడిన దానవై నీ కడుపుతో ప్రాకుచు నీవు బ్రదుకు దినములన్నియు మన్ను తిందువు. ఆది 3 : 4.

[సాతాను సర్పాకారంలో వున్నంత మాత్రాన పాము లన్నిటినీ ఎందుకు శపించాలి! కడుపుతో ప్రాకమని శపించబడక పూర్వం పాము ఏ రకంగా కదలేది? దేవుడు శపించినా పాములు ఎందువల్ల మన్నుతిని బ్రతకడంలేదు? యెష 65:25 ప్రకారం సింహం ఎద్దులాగ గడ్డి తిన్నప్పుడు, తోడేలు గొర్రెపిల్ల కలిసి ఆహారం తీసుకన్నపుడు పాములు మన్నును ఆహారంగా స్వీకరిస్తాయి]

## దేవుడు దర్జీ

దేవుడైన యెహోవా ఆదామునకు అతని భార్యకును చర్మపు చొక్కాయిలను చేయించి వారికి తొడిగించెను. ఆది 3 ; 21.

## ప్రత్యర్థి లేకుండ ముందు జాగ్రత్త

అప్పుడు దేవుడైన యెహోవా - ఇదిగో మంచి చెడ్డలను ఎరుగునట్లు, ఆదాము మనలో ఒకనివంటి వాడాయెను. కాబట్టి ఒకవేళ అతడు తన చెయ్యి చాచి జీవ వృక్షఫలమును కూడ తీసికొని తిని నిరంతరము జీవించునేమో అని దేవుడైన యెహోవా అతడు ఏ నేలనుండి తీయబడెనో దాని సేద్యపరచుటకు ఏదెను తోటలో నుండి అతని పంపివేసెను. అప్పుడాయన ఆదామును వెళ్ళగొట్టి ఏదెను తోటకు తూర్పుదిక్కున కెరూబులను, జీవవృక్షమునకు పోవు మార్గమునుకాచుటకు ఇటుఅటు తిరుగుచున్న ఖడ్గజ్వాలను నిలువబెట్టెను. ఆది 3 : 22 - 24.

## చల్లటి కూరగాయలకంటె వేపుడు మాంసమే దేవుడి క్టిష్టం

కయీను పొలము పంటలో కొంత యెహోవాకు అర్పణగా తెచ్చెను. హేబెలుకూడ తన మందలో తొలిచూలున పుట్టిన వాటిలో క్రొవ్విన వాటిని కొన్ని

తెచ్చెను. యెహోవా హెబెలును అతని యర్పణను లక్ష్యపెట్టెను. కయీనును అతని యర్పణను లక్ష్య పెట్టలేదు. ఆది 4 : 3-5.

## దేవుడు హెబెలును చంపిన కయీనును కాపాడాడుగాని హెబెలును కాపాడలేదు.

అందుకు యెహోవా అతనితో-కాబట్టి యెవడైనను కయీనును చంపిన యెడల వానికి ప్రతిదండన యేడంతలు కలుగుననెను. మరియు ఎవడైనను కయీనును కనుగొని ఆతనిని చంపకయుండునట్లు యెహోవా ఆతనికి ఒక గురుతు వేసెను. ఆది 4 : 15.

## దీర్ఘాయుష్షు కలవాడు

మెతూషెల దినములన్నియు తొమ్మిదివందల అరువది తొమ్మిదియేండ్లు అప్పుడతడు మృతిబొందెను. ఆది 5 : 27.

## మానవ స్త్రీలతో దేవదూతల కలయిక

ఆ దినములలో నెఫీలులను (బలాత్కారులు) వారు భూమి మీద నుండిరి; తరువాతను ఉండిరి. దేవుని కుమారులు నరుల కుమార్తెలతో పోయినప్పుడు వారికి పిల్లలను కనిరి. పూర్వకాలమందు పేరుపొందిన శూరులు వీరే. ఆది 6 : 4

## మానవుడి దుర్మార్గ ఫలితంగా సమస్త జంతుజలాన్ని నాశనం చేయబూనడం

నరుల చెడుతనము భూమి మీద గొప్పదనియు, వారి హృదయముయొక్క తలంపులలోని ఊహ అంతయు ఎల్లప్పుడు కేవలము చెడ్డదనియు యెహోవా చూచి....నేను సృజించిన నరులను నరులతో కూడ జంతువులను పురుగులను ఆకాశ పక్ష్యాదులను భూమి మీద నుండకుండ తుడిచివేయుదును: ఆది 6 : 5, 7.

## మానవుడి దుర్మార్గమే ఆ సంకల్పాన్ని విరమింపజేసింది.

అప్పుడు యెహోవా-ఇకమీదట నరులను బట్టి భూమిని మరల శపించను,

ఎందుకనగా నరుల హృదయాలోచన వారి బాల్యము నుండి చెడ్డది. నేనిప్పుడు చేసిన ప్రకారముగా ఇకను సమస్త జీవులను సంహరింపను. ఆది 8 : 21.

## నోవహు ఓడ

ఆ ఓడ మూడువందల మూరల పొడుగును ఏబది మూరల వెడల్పును ముప్పది మూరల యెత్తును గలదై యుండవలెను. ఆది 6 : 15.

సమస్త జీవులలో, అనగా సమస్త శరీరుల యొక్క ప్రతి జాతిలోనివి రెండేసి చొప్పున నీవు ఓడలోనికి తేవలెను. వాటిలో మగదియు ఆడుదియు నుండవలెను. నీవు వాటిని బ్రదికించి యుంచుకొనుటకై వాటివాటి జాతుల ప్రకారం పక్షులలోను....జంతువులలోను....నేలను ప్రాకు వాటన్నిటిలోను, ప్రతి జాతిలో రెండేసి చొప్పున నీ యొద్దకు అవి వచ్చును. ఆది 6 : 19, 20. (ఆది 7 : 2, 3 ప్రకారం "పవిత్ర జంతువులలో ఏడేసి చొప్పున" అని వున్నది.)

ఆ దినమందే నోవహును నోవహు కుమారులగు షేమును హామును యాపెతును నోవహు భార్యయు వారిలోకూడ అతని ముగ్గురుకోడండ్రును ఆ ఓడలో ప్రవేశించిరి. వీరేకాదు; ఆయా జాతుల ప్రకారము ప్రతి మృగమును, ఆయా జాతుల ప్రకారము ప్రతి పశువును; ఆయా జాతుల ప్రకారము నేల మీద ప్రాకు ప్రతి పురుగును, ఆయా జాతుల ప్రకారము ప్రతి పక్షియు, నానా విధములైన రెక్కలుగల ప్రతి పిట్టయు ప్రవేశించెను, జీవాత్మ గల సమస్త శరీరులలో రెండేసి రెండేసి ఓడలో నున్న నోవహు నొద్ద ప్రవేశించెను. ఆది 7 : 13-15.

[150 గజాల పొడవు 25 గజాల వెడల్పు 15 గజాల ఎత్తుగల నోవహు ఓడలో జీవము గల సమస్త ప్రాణుల నుండి రెండేసి చొప్పున (లేదా ఏడేసి చొప్పున లేదా పద్నాలుగు చొప్పున) కూరబడ్డాయి. అప్పటికి కనీసం క్షీరదాలలో 1,600 జాతులు, పక్షులలో 12,500 జాతులు, ప్రాకెడు జంతువులలో 600 జాతులు, పురుగులు కీటకాలు మొదలైన అల్ప ప్రాణులు 10,00,000 వుండి వుండాలి. ఇవన్నీ ప్రపంచం నలుమూలల నుండి ఇక్కడకు చేరుకున్నాయి. దక్షిణ అమెరికాలోని కొన్ని జాతుల జంతువులు అక్కడకు చేరడానికి సృష్టికి పూర్వమే బయలు దేరి వుండాలి !]

## సమస్త ప్రాణులకు ఆహారం సిద్ధం చేయాల్సిన బాధ్యత నోవహుదే

మరియు తినుటకు నానావిధములైన ఆహార పదార్థములను కూర్చుకొని నీ దగ్గర ఉంచుకొనుము; అవి నీకును వాటికిని ఆహారమగునని చెప్పెను. నోవహు అట్లు చేసెను, దేవుడు అతని కాజ్ఞాపించిన ప్రకారము యావత్తు చేసెను.

ఆది 6 : 21, 22.

(ఆది 7 : 11; 8 : 14ల ప్రకారం ఈ సముద్రయానానికి సంవత్సరకాలం పైనే పట్టింది. ఎనమండుగురు మనుషులు కాక 20,00,000 పైగా ఇతర ప్రాణులు కూడ హాజరయి వుంటాయి)

## మూడంతస్థుల ఓడలో 18 అంగుళాల కిటికీ ఒకటి, తలుపు ఒకటి మాత్రమే వున్నాయి !

ఆ ఓడకు కిటికీ చేసి పై నుండి మూరెడు క్రిందికి దాని ముగించవలెను; ఓడతలుపు దాని ప్రక్కను ఉంచవలెను; క్రింది అంతస్థు రెండవ అంతస్థు మూడవ అంతస్థు గలదిగా దాని చేయవలెను. ఆది 6 : 16.

## భూగోళమంతా మునిగి పోవడానికి సరిపోయే వర్షం

ఆ ప్రచండ జలములు భూమిమీద అత్యధికముగా ప్రబలినందున ఆకాశమంతటి క్రిందనున్న గొప్ప పర్వతములన్నియు మునిగిపోయెను. ఆది 7:19

## వేయించిన మాంసమంటె దేవుడి కెంతో యిష్టం

అప్పుడు నోవహు యెహోవాకు బలిపీఠము కట్టి, పవిత్ర పశువులన్నిటిలోను, పవిత్ర పక్షులన్నిటిలోను కొన్ని తీసికొని ఆ పీఠము మీద దహన బలి అర్పించెను, అప్పుడు యెహోవా ఇంపైన సువాసన నాఘ్రాణించెను.

ఆది 8 : 20, 21.

## నోవహు అదుపులో పెద్దపులులు, సొరచేపలు కూడ ఉన్నట్లా ?

మరియు దేవుడు నోవహును అతని కుమారులను ఆశీర్వదించి ... మీ భయమును మీ బెదురును అడవిజంతువులన్నిటికిని .... సముద్రపు చేప లన్నిటికిని కలుగును. ఆది 9 : 1, 2.

2)

## దేవుడి ఏర్పాటు ప్రకారం రక్తాన్ని తప్పించి అన్ని రకాల ప్రాణుల మాంసాన్ని మానవుడు తినవచ్చు

ప్రాణముగల సమస్త చరములు మీకు ఆహారమగును .... అయినను మాంసమును దాని రక్తముతో మీరు తినకూడదు; రక్తమే దాని ప్రాణము.

ఆది 9 : 3, 4.

## సర్వజ్ఞుడైన దేవునికి ఆరా తీయవల్సిన అవసరం ఉందా?

యెహోవా నరుల కుమారులు కట్టిన పట్టణమును గోపురమును చూడ దిగి వచ్చెను. ఆది 11 : 5.

[గోపుర శిఖరము "ఆకాశమునంటు" నట్లుంచుదమట!]

## భాషల అవిర్భావం గురించి అశాస్త్రీయమైన అంచనా

అప్పుడు యెహోవా - ఇదిగో జనము ఒక్కటే; వారి కందరికీ భాష ఒక్కటే; వారు ఈ పని ఆరభించియున్నారు. ఇక మీదట వారు చేయదలచు ఏ పనియైనను చేయకుండ వారికి ఆటంకమేమియు నుండదు గనుక మనము దిగిపోయి వారిలో ఒకనిమాట ఒకనికి తెలియకుండ తారుమారు చేయుదము రండని అనుకొనెను ....దానికి బాబెలు అని పేరు పెట్టిరి; ఎందుకనగా అక్కడ యెహోవా భూజనులందరి భాషను తారుమారు చేసెను. అక్కడ నుండి యెహోవా భూమియందంతట వారిని చెదరగొట్టెను. ఆది 11 : 6 - 9.

## పవిత్ర బలి

అతడు యెహోవాను నమ్మెను; ఆయన అది అతనికి నీతిగా ఎంచెను.మరియు ఆయన .... యెహోవాను నేనే అని చెప్పి .... మూడేండ్ల పెయ్యను మూడేండ్ల మేకను మూడేండ్ల పొట్టేలును ఒక తెల్లగువ్వను ఒక పావురపు పిల్లను నా యొద్దకు తెమ్మని అతనితో చెప్పెను. అతడు అవన్నియు తీసికొని వాటిని నడుమకు ఖండించి దేని ఖండమును దాని ఖండమునకు ఎదురుగా నుంచెను. పక్షులను అతడు ఖండింపలేదు .... మరియు ప్రొద్దుగ్రుంకి కటిక చీకటి పడినప్పుడు రాజుచున్న పొయ్యియు అగ్నిజ్వాలయును కనబడి ఆ ఖండముల మధ్య నడిచిపోయెను. ఆ దినమందే యెహోవా .... అబ్రాముతో నిబంధన చేసెను ఆది 15 : 6 - 10, 17 — 21

## అనాగరిక నిబంధన

మరియు దేవుడు - నీవును నీవు మాత్రమేగాక నీ తరువాత వారి తరములలో నీ సంతతియు నా నిబంధనను గైకొనవలెను. నాకును నీకును నీ తరువాత నీ సంతతికిని మధ్య మీరు గైకొనవలసిన నా నిబంధన యేదనగా - మీలో ప్రతి మగవాడును సున్నతి పొందవలెను. మీరు మీ గోప్యాంగ చర్మమున సున్నతి పొందవలెను. అది నాకు నీకు మధ్యనున్న నిబంధనకు సూచనగా ఉండును. ఎనిమిది దినముల వయస్సు గలవాడు, అనగా నీ ఇంటపుట్టిన వాడయినను, నీ సంతానముకాని అన్యునియొద్ద వెండితో కొనబడిన వాడైనను, మీ తరములలో ప్రతి మగవాడు మీలో సున్నతి పొందవలెను. నీ యింట పుట్టినవాడును, నీ వెండితో కొనబడినవాడును, తప్పక సున్నతి పొందవలెను. అప్పుడు నా నిబంధన మీ శరీరమందు నిత్యనిబంధనగా ఉండును. సున్నతి పొందని మగవాడు, అనగా ఎవని గోప్యాంగ చర్మమున సున్నతి చేయబడదో అట్టివాడు తన జనులలో నుండి కొట్టివేయబడును. వాడు నా నిబంధనను మీరియున్నాడని అబ్రాహాముతో చెప్పెను.

ఆది 17 : 9 – 14.

## 70 యేండ్ల శారయితో ప్రేమలోపడ్డ ఫరోరాజు

అతడు ఐగుప్తులో ప్రవేశించుటకు అతడు తన భార్యయయిన శారయితో– ఇదిగో నీవు చక్కని దానివని యెరుగుదును. ఐగుప్తీయులు నిన్ను చూచి యీమె అతని భార్య అని చెప్పి నన్ను చంపి నిన్ను బ్రదుకనిచ్చెదరు. నీవలన నాకు మేలు కలుగునట్లును నిన్ను బట్టి నేను బ్రదుకునట్లును నీవు నా సహోదరివని దయచేసి చెప్పుమనెను. అబ్రాము ఐగుప్తులో చేరినప్పుడు ఐగుప్తీయులు ఆ స్త్రీ మిక్కిలి సౌందర్యవతియయి యుండుట చూచిరి. ఫరో యొక్క అధిపతులు ఆమెను చూచి ఫరో యెదుట పొగిడిరి గనుక ఆ స్త్రీ ఫరో యింటికి తేబడెను. అతడామెను బట్టి అబ్రామునకు మేలు చేసెను. అందువలన అతనికి గొఱ్ఱెలు, గొడ్లు మగగాడిదలు దాసులు పనికత్తెలు ఆడుగాడిదలు ఒంటెలు ఇయ్యబడెను. అయితే అబ్రాము భార్యయయిన శారయిని బట్టి ఫరోను అతని ఇంటివారిని మహావేదనల చేత బాధించెను. అప్పుడు ఫరో అబ్రామును పిలిపించి–నీవు నాకు చేసినది యేమిటి? ఈమె నీ భార్య అని నాకెందుకు తెలుపలేదు? ఈమె నా సహోదరి అని యేల

చెప్పితివి ? నేనామెను నా భార్యగా చేసికొందునేమో అయితే నేమి, ఇదిగో నీభార్య; ఈమెను తీసికొని పొమ్మని చెప్పెను. ఆది 12 ; 11-9.

(ఆది 12 ; 4 ప్రకారం అబ్రాము హారాను నుండి బయలు దేరినప్పుడు అతని వయస్సు 75 సంవత్సరాలు. ఆది 17 ; 17 ప్రకారం శారయి అబ్రాము కంటె 10 సంవత్సరాలు చిన్నది)

## 90 యేండ్ల శారా మీద మనసుపడ్డ అబీమెలెకు

అబ్రాము తన భార్యయైన శారాను గూర్చి-ఈమె నా చెల్లెలని చెప్పెను గనుక గెరారు రాజైన అబీమెలెకు శారాను పిలిపించి తన యింట చేర్చుకొనెను. అయినను రాత్రివేళ దేవుడు స్వప్నమందు అబీమెలెకు నొద్దకు వచ్చి-నీవు నీయింట చేర్చుకొనిన స్త్రీ ఒక పురుషునికి భార్య గనుక ఆమె నిమిత్తము నీవు చచ్చినవాడవు సుమా అని చెప్పెను ...అబీమెలెకు గొఱ్ఱెలను గొడ్లను దాస దాసీజనులను....వెయ్యి రూపాయలిచ్చెను....అబ్రాహాము దేవుని ప్రార్థింపగా దేవుడు అబీమెలెకును అతని భార్యను అతని దాసీలను బాగు చేసెను; వారు పిల్లలు కనిరి. ఏలయనగా అబ్రాహాము భార్య యయిన శారాను బట్టి దేవుడు అబీమెలెకు ఇంటిలో ప్రతి గర్భమును మూసియుండెను. ఆది 20 : 2, 3, 14, 16-18.

## దేవుడికి, దేవదూతలకు భోజనం పెట్టిన అబ్రాహాము

మమ్రే దగ్గర నున్న సింధూర వనములో అబ్రాహాము ఎండవేళ గుడారపు ద్వారమందు కూర్చుని యున్నపుడు యెహోవా అతనికి కనబడెను. అతడు కన్నులెత్తి చూచినప్పుడు ముగ్గురు మనుష్యులు అతని యెదుట నిలువబడి యుండిరి.... మరియు అబ్రాహాము పశువుల మందకు పరుగెత్తి ఒక మంచి లేత దూడను తెచ్చి ఒక పనివాని కప్పగించెను. వాడు దాని త్వరగా సిద్ధపరచెను. తరువాత అతడు వెన్నను పాలను తాను సిద్ధము చేయించిన దూడను తెచ్చి వారి యెదుట పెట్టి వారు భోజనము చేయుచుండగా వారి యొద్ద ఆ చెట్టు క్రింద నిలుచుండెను.

ఆది 18 : 1, 7 8.

## శారాకు దేవుని మందలింపు

అందుకాయన .... నీ భార్యయైన శారాకు ఒక కుమారుడు కలుగునని చెప్పెను. శారా ఆయన వెనుకనుండిన గుడారపు ద్వారమందు వినుచుండెను.

అబ్రాహామును శారాయును బహుకాలము గడచిన వృద్ధులైయుండిరి. స్త్రీ ధర్మము శారాకు నిలిచిపోయెను గనుక శారా - నేను బలము ఉడిగినదాననైన తరువాత నాకు సుఖము కలుగునా? నా యజమానుడును వృద్ధుడైయున్నాడు గదా అని తనలో నవ్వు కొనెను. అంతట యెహోవా అబ్రాహాముతో - వృద్ధురాలనైన నేను నిశ్చయముగా ప్రసవించెదనా అని శారా నవ్వనేల? యెహోవాకు అసాధ్యమైనది ఏదైన నున్నదా! మీదటికి ఈ కాలమున నిర్ణయకాలమందు నీ యొద్దకు తిరిగివచ్చెదను. అప్పుడు శారాకు కుమారుడు కలుగుననెను. శారా భయపడి - నేను నవ్వలేదని చెప్పగా ఆయన – అవును నీవు నవ్వితివనెను. ఆది 18 : 10-15.

(అప్పటికి శారా వయస్సు 90 యేళ్ళు, అబ్రాహాము వయస్సు 99 లేక 100 యేళ్ళు. ఈ వివరాల కోసం ఆది 17 : 17, 24 చూడండి)

## పరలోకము భూమికి దగ్గరగా వున్నట్టా? భూమిమీదకు వినిపించేంత దగ్గరగా పరలోకం నుండి పిలిచినట్టా!

అప్పుడు దేవుని దూత ఆకాశమునుండి హాగరును పిలిచి - హాగరూ నీకేమి వచ్చినది? .... అనెను. ఆది 21 : 17.

యెహోవా దూత పరలోకమునుండి - అబ్రాహామా, అబ్రాహామా అని అతని పిలిచెను; అందుకతడు - చిత్తము ప్రభువా అనెను. అప్పుడు ఆయన - ఆ చిన్న వానిమీద చెయ్యి వేయకుము; అతనినేమియు చేయకుము; నీ ఒకడైయున్న నీ కుమారుని నాకియ్య వెనుతీయలేదు గనుక నీవు దేవునికి భయపడువాడవని యిందువలన నాకు కనబడుచున్నదనెను. ఆది 22 : 11, 12.

యెహోవా దూత రెండవమారు పరలోకమునుండి అబ్రాహామును పిలిచెను.
ఆది 22 : 15.

## ఉప్పు స్తంభంగా మారిన లోతు భార్య!

అయితే లోతు భార్య అతని వెనుకనుండి తిరిగి చూచి ఉప్పు స్తంభమాయెను.
ఆది 19 : 26.

## మామను అద్భుతంగా మోసగించిన యాకోబు

యాకోబు చినారుజంగిసాలు అను చెట్లచువ్వలను తీసికొని ఆ చువ్వలలో

తెల్లచారలు కనబడునట్లు అక్కడక్కడ వాటి తొక్కలు ఒలిచి మందలు నీళ్ళుత్రాగ వచ్చినప్పుడు అవి చూలుకట్టుటకు అతడు తాను ఒలిచిన చువ్వలను మందలు త్రాగుటకు వచ్చు కాలువలలోను నీళ్ళగాళ్ళలోను వాటి యెదుట పెట్టగా మందలు ఆచువ్వల యెదుట చూలుకట్టి చారలైనను పొడలైనను మచ్చలైనను గల పిల్లలను ఈనెను ... మంద బలహీనమైనప్పుడు పెట్టలేదు. అట్లు బలహీనమైనవి లాబానుకును బలమైనవి యాకోబుకును వచ్చెను ఆది 30 : 37 - 42.

## జరగబోయే సంఘటనలను వివరించే కలలు

పానదాయకుడును భక్ష్యకారుడును ఒక్కటే రాత్రియందు కలలు కనిరి: ఒక్కొక్కడు వేరువేరు భావముల కలకనెను .... పానదాయకుల అధిపతి ఉద్యోగము మరల అతనికిచ్చెను గనుక అతడు ఫరోచేతికి గిన్నె నిచ్చెను. మరియు యోసేపు వారికి తెలిపిన భావముచొప్పున భక్ష్యకారుల అధిపతిని వ్రేలాడదీయించెను.

ఆది 40 : 5, 21, 22.

అందుకు యోసేపు - ఫరో కనిన కల ఒక్కటే. దేవుడు తాను చేయబోవుచున్నది ఫరోకు తెలియజేసెను. ఆ ఏడు మంచి ఆవులు ఏడు సంవత్సరములు. ఆ ఏడు మంచి వెన్నులును ఏడు సంవత్సరములు. కల ఒక్కటే. వాటి తరువాత, చిక్కిపోయి వికారమై పైకి వచ్చిన ఏడు ఆవులును ఏడు సంవత్సరములు; తూర్పు గాలిచేత చెడిపోయిన ఏడు పీల వెన్నులు కరవుగల ఏడు సంవత్సరములు.

ఆది 41 : 25 - 27.

## అద్భుతంగా వృద్ధిచెందిన ఇశ్రాయేలీయులు

యాకోబు గర్భమున పుట్టిన వారందరు డెబ్బదిమంది. అప్పటికి యోసేపు ఐగుప్తులో ఉండెను .... ఇశ్రాయేలీయులు బహు సంతానము గలవారై అభివృద్ధిపొంది విస్తరించి అత్యధికముగా ప్రబలిరి; వారున్న ప్రదేశము వారితో నిండియుండెను.

నిర్గ 1 : 5, 7.

అప్పుడు ఇశ్రాయేలీయులు రామసేసు నుండి సుక్కోతుకు ప్రయాణమై పోయిరి. వారు పిల్లలుకాక కాల్బలము ఆరులక్షల వీరులు. నిర్గ 1 :37.

ఇరువది యేండ్లు మొదలుకొని పై ప్రాయము కలిగిన సేనగా యలు వెళ్ళిన

ఇశ్రాయేలీయులందరు లెక్కింపబడి ఆరులక్షల మూడువేల ఐదువందల యాబది మందియైరి. అయితే లేవీయులు తమ పితురుల గోత్రము చొప్పున వారితోపాటు లెక్కింపబడలేదు. సంఖ్యా 1 : 45 - 47.

[సేనగా బయలుదేరిన వారి స్త్రీలను, పిల్లలనుకూడి కలుపుకుంటే మొత్తం ఇశ్రాయేలీయుల సంఖ్య 30,00,000 అయినా వుండాలి ఇది 215 సంవత్సరాల్లో జరిగిన బ్రహ్మాండమైన అభివృద్ధి (గల 3 : 16 తో ఆది 12 : 2 ను పోల్చి చూడండి) 25 సంవత్సరాల కొకసారి వారి జనాభా రెట్టింపయిందనుకున్నా 20,000 కు మించకూడదు. ఇశ్రాయేలీయులకు తొలిసారి పుట్టిన మగవారే 22,273 మంది (సంఖ్యా 3 : 40–43) దీన్నిబట్టి లెక్కిస్తే ఒక్కొక్క తల్లి సరాసరిన 66 మంది పిల్లల్ని కనివుండాలి!]

## పాలస్తీనాలో అంతులేని జనాభా

హిత్తీయులు గిర్గాషీయులు అమోరీయులు కనానీయులు పెరిజ్జీయులు హివ్వీయులు యెబూసీయులను ఏడు జనములు సంఖ్యచేతను బలముచేతను నిన్ను మించిన వారు. ద్వితీ 7 : 1.

[3,000 చదరపు మైళ్ళ వైశాల్యం మాత్రమే వున్న ఆ పవిత్ర భూమిలో కనీసం, 2, 0,00,000 జనాభా వుండి ఉండాలి. అంటే నిస్సారమైన ఆరాష్ట్రం నేటి ఇంగ్లండు కంటే అధిక జనసాంద్రత కలిగినదై యుండాలి)

## మంటల్లో దర్శన మిచ్చిన దేవుడు

ఒక పొద నడిమిని అగ్నిజ్వాలలో యెహోవా దూత అతనికి ప్రత్యక్షమాయెను. అతడు చూచినపుడు అగ్నివలన ఆ పొద మండుచుండెనుగాని పొద కాలి పోలేదు....దానిని చూచుటకు అతడు ఆ తట్టు వచ్చుట యెహోవా చూచెను. దేవుడు ఆ పొద నడుమ నుండి–మోషే మోషే అని అతని పిలిచెను. అందు కతడు–చిత్తము ప్రభువా అనెను. అందుకాయన–దగ్గరకు రావద్దు, నీ పాదముల నుండి నీ చెప్పులు విడువుము, నీవు నిలిచియున్న స్థలము పరిశుద్ధ ప్రదేశము అనెను. నిర్గ 3 : 2-5.

## మంత్ర తంత్రాలతో తనని రుజువు పర్చుకోవటానికి దేవుడి పాట్లు !

అందుకు మోషే–చిత్తగించుము; వారు నా మాట నమ్మరు, నా మాట

వినరు–యెహోవా నీకు ప్రత్యక్షము కాలేదందురు అని ఉత్తర మియ్యగా యెహోవా–నీ చేతిలోనిది ఏమిటి అని అతని నడిగెను. అందుకతడు–కఱ్ఱ అనెను. అప్పుడాయన–నేలను దాని పడ వేయుమనెను. అతడు దాని నేల పడవేయగానే అది పామాయెను. అప్పుడు యెహోవా–నీ చెయ్యి చాపి దాని తోక పట్టుకొనుమనగా, అతడు తన చెయ్యి చాపి దాని తోక పట్టుకొనగానే అది అతని చేతిలో కఱ్ఱ ఆయెను. ఆయన–దాని చేత వారు తమ పితురుల దేవుడైన యెహోవా, అనగా అబ్రాహాము దేవుడు ఇస్సాకు దేవుడు యాకోబు దేవుడు నీకు ప్రత్యక్షమాయెనని నమ్ముదురనెను.

నిర్గ 4 : 1-5.

కాబట్టి మోషే అహరోనులు ఫరో యొద్దకు వెళ్లి యెహోవా తమ కాజ్ఞా పించినట్లు చేసిరి అహరోను ఫరో యెదుటను అతని సేవకుల యెదుటను తన కఱ్ఱను పడవేయగానే అది సర్పమాయెను. అప్పుడు ఫరో తన విద్వాంసులను మంత్రజ్ఞులను పిలిపించెను. ఐగుప్తుశకునగాండ్రు కూడ తమ మంత్రముల చేత అలాగే చేసిరి. వారిలో ప్రతివాడును తన కఱ్ఱను పడవేసినప్పుడు అది సర్పమాయెనుగాని అహరోను కఱ్ఱ వారి కఱ్ఱలను మ్రింగివేసెను. నిర్గ 7 : 10 - 12.

## దేవుడి వింత మనస్తత్వం

అంతట యెహోవా....ఐగుప్తునకు తిరిగి వెళ్లుమని మిద్యానులో మోషేతో చెప్పగా....అతడు పోవు మార్గమున సత్రములో యెహోవా అతనిని ఎదుర్కొని అతనిని చంప చూడగా సిప్పోరా వాడిగల రాయి తీసికొని తన కుమారునికి సున్నతి చేసి అతని పాదముల యొద్ద అది పడవేసి–నిజముగా నీవు నాకు రక్త సంబంధమైన పెనిమిటివైతి వనెను. అంతట ఆయన అతని విడిచెను. అప్పుడు ఆమె–ఈ సున్నతిని బట్టి నీవు నాకు రక్త సంబంధమైన పెనిమిటివైతి వనెను.

నిర్గ 4 : 19, 24 - 26.

## నీరు రక్తంగా మారింది!

యెహోవా ఆజ్ఞాపించినటు మోషే అహరోనులు చేసిరి. అతడు ఫరో యెదుటను అతని సేవకుల యెదుటను తన కర్రను పైకెత్తి నీళ్లను కొట్టగా ఏటి నీళ్లన్నియు రక్తముగా మార్చబడెను .... ఐగుప్తు దేశమంతట రక్తము

ఉండెను. ఐగుప్తు శకునగాండ్రు కూడ తమ మంత్రముల వలన అట్లుచేసెను.
నిర్గ 7 : 20 - 22.

(మోషే ఐగుప్తులోని నీటినంతటినీ రక్తంగా మార్చిన తరువాత శకునగాండ్రు కూడ నీటిని రక్తంగా మార్చారట. మరి వీళ్ళకు ఇంకా నీళ్ళెక్కడ మిగిలాయో!)

## ఇంద్రజాలంతో కప్పలు

అహరోను ఐగుప్తు జలములమీద తన చెయ్యిచాపెను. అప్పుడు కప్పలు ఎక్కివచ్చి ఐగుప్తుదేశమును కప్పెను. శకునగాండ్రు కూడ తమ మంత్రముల వలన ఆలాగుచేసి ఐగుప్తు దేశము మీదికి కప్పలను రాజేసిరి. నిర్గ 8:6,7.

## మరో ఇంద్రజాలం

అందుకు యెహోవా మోషేతో నీవు నీ కర్ర చాపి ఈ దేశపు ధూళిని కొట్టుము. అది ఐగుప్తు దేశమందంతటను పేలగునని అహరోనుతో చెప్పుమనగా వారు అట్లు చేసిరి, అహరోను తన కర్రను పట్టుకొని చెయ్యిచాపి ఆ దేశపుధూళిని కొట్టినప్పుడు పేలు మనుష్యుల మీదను జంతువుల మీదను ఉండెను. ఐగుప్తు దేశ మందంతటను ఆ దేశపు ధూళి అంతయు పేలాయెను .... శకునగాండ్రు ఇది దైవ శక్తి (దేవుని వ్రేలు) అని ఫరోతో చెప్పిరి. నిర్గ 8:16-19.

## దారుణమైన అద్భుతాలు

ఇదిగో యెహోవా బాహుబలము పొలములోనున్న నీ పశువుల మీదికిని నీ గుఱ్ఱముల మీదికిని గాడిదల మీదికిని ఒంటెల మీదికిని ఎద్దుల మీదికిని గొర్రెల మీదికిని వచ్చును .... మరునాడు యెహోవా ఆ కార్యము చేయగా ఐగుప్తీయుల పశువులన్నియు చచ్చెను గాని ఇశ్రాయేలీయుల పశువులలో ఒకటియు చావలేదు.
నిర్గ 9 : 3, 6.

కాగా యెహోవా — మీరు పిడికిళ్ళ నిండా ఆవపు బొగ్గు తీసికొనుడి, మోషే ఫరో కన్నులయెదుట ఆకాశమువైపు దాని చల్లవలెను. అప్పుడు అది ఐగుప్తు దేశ మంతట సన్నధూళియై ఐగుప్తు దేశమంతట మనుష్యుల మీదను జంతువుల మీదను పొక్కులు పొక్కు దద్దురులగునని మోషే అహరోనులతో చెప్పెను. కాబట్టి వారు

అవపు బుగ్గిని తీసికొనివచ్చి ఫరో యెదుట నిలిచిరి. మోషే ఆకాశమువైపు దాని చల్లగానే అది మనుష్యులకును జంతువులకును పొక్కులు పొక్కు దద్దురులాయెను
నిర్గ 9:8–10.

ఇంటికి రప్పింపబడక పొలములో ఉండు ప్రతి మనుష్యుని మీదను జంతువు మీదను వడగండ్లు కురియును, అప్పుడు అవి చచ్చునని చెప్పుమనెను .... మోషే తన కర్రను ఆకాశమువైపు ఎత్తినప్పుడు యెహోవా ఉరుములను వడగండ్లను కలుగ జేయగా పిడుగులు భూమిమీద పడుచుండెను. ఆ వడగండ్లు ఐగుప్తు దేశమంతట మనుష్యులనేమి జంతువులనేమి బయటనున్నది యావత్తును నశింపజేసెను.
నిర్గ 9 : 19, 23, 25.

అర్ధరాత్రివేళ జరిగినదేమనగా ఐగుప్తుదేశమందలి తొలి పిల్లలనందరిని పశువుల తొలిపిల్లల నన్నిటిని యెహోవా హతము చేసెను. నిర్గ 12: 29.

యెహోవా మనుష్యుల తొలి సంతానమేమి జంతువుల తొలి సంతానమేమి ఐగుప్తు దేశములో తొలి సంతానమంతయు సంహరించెను. ఆ హేతువుచేతను నేను మగదైన ప్రతి తొలిచూలు పిల్లను యెహోవాకు బలిగా అర్పించుదును.
నిర్గ 13 : 15.

## మోషే ఇంద్రజాలం

ఐగుప్తీయులు, అనగా ఫరో రథముల గుర్రములన్నియు అతని గుర్రపు రౌతులు అతని దండును వారిని తరిమి .... మోషే సముద్రము మీద తన చెయ్యి చాపగా .... నీళ్ళు తిరిగివచ్చి ఆ రథములను రౌతులను వారి వెనుక సముద్రము లోనికి వచ్చిన ఫరోయొక్క సర్వసేనను కప్పివేసెను. వారిలో ఒక్కడైనను మిగిలియుండలేదు. నిర్గ 14 : 9, 27, 28.

## చదరంగపు బల్లలోని గళ్ళలాగ ఐగుప్తు దేశంలో ఒక్కోచోట వెలుగు వుండగా, ఇంకోచోట చీకటి కమ్మిందట!

మోషే ఆకాశమువైపు తన చెయ్యి ఎత్తినప్పుడు ఐగుప్తు దేశమంతయు మూడు దినములు గాఢాంధకారమాయెను, మూడు దినములు ఒకనినొకడు కనుగొన లేదు, ఎవడును తానున్నచోట నుండి లేవలేకపోయెను. అయినను ఇశ్రాయేలీయుల కందరికి వారి నివాసములలో వెలుగుండెను. నిర్గ 10:22, 23

## మేఘ స్తంభములో దేవుడు

వారు పగలు రాత్రియు ప్రయాణము చేయునట్లుగా యెహోవా త్రోవలో వారిని నడిపించుటకై పగటివేళ మేఘ స్తంభములోను, వారికి వెలుగిచ్చుటకు రాత్రివేళ అగ్ని స్తంభములోను ఉండి వారికి ముందుగా నడుచుచు వచ్చెను. ఆయన పగటి వేళ మేఘ స్తంభమునైనను రాత్రివేళ అగ్ని స్తంభమునైనను ప్రజల యెదుటనుండి తొలగింపలేదు. నిర్గ 13:21,22.

(సంఖ్యా 9 ; 17 - 23 కూడ చూడండి)

## మాట్లాడే మేఘం

మోషే గుడారములోనికి పోయినప్పుడు మేఘ స్తంభము దిగి ఆ గుడారపు ద్వారమందు నిలువగా యెహోవా మోషేతో మాటలాడు చుండెను. ప్రజలందరు ఆ మేఘ స్తంభము ఆ గుడారపు ద్వారమున నిలుచుట చూచెను .... మనుష్యుడుతన స్నేహితునితో మాటలాడునట్లు యెహోవా మోషేతో ముఖాముఖిగా మాటలాడు చుండెను. నిర్గ 33;9–11.

(సంఖ్యా 12:5,6 కూడ చూడండి)

## మోషే దివ్యదండం సహాయంతో సముద్రాన్ని రెండుగా చీల్చి, 30,00,000 మంది ఇశ్రాయేలీయులు వెళ్లడానికి సరిపోయే మార్గాన్ని ఏర్పరచి, రెండు వైపులా వున్న నీటిని గోడలవలె గడ్డ కట్టించాడట !

మోషే సముద్రము వైపు తన చెయ్యి చాపగా యెహోవా ఆ రాత్రి అంతయు బలమైన తూర్పుగాలి చేత సముద్రమును తొలగించి దానిని ఆరిన నేలగా చేసెను. నీళ్లు విభజింపబడగా ఇశ్రాయేలీయులు సముద్రము మధ్యను ఆరిన నేల మీద నడిచి పోయిరి, ఆ నీళ్లు కుడి ఎడమ ప్రక్కలను వారికి గోడవలె నుండెను.

నిర్గ 4 ; 21, 22.

నీ నాసికా రంధ్రముల ఊపిరి వలన నీళ్లు రాశిగా కూర్చబడెను. ప్రవాహములు కుప్పగా నిలిచెను. అగాధ జలములు సముద్రము మధ్య గడ్డకట్టెను. నిర్గ 15 : 8.

## మేఘ రూపంలో దేవుడి కుచేష్టలు

వేకువ జామున యెహోవా ఆ అగ్ని మేఘమయమైన స్తంభము నుండి ఐగుప్తీయుల దండును కలవరపరచి వారి రథ చక్రములు ఊడిపడునట్లు చేయగా వారు బహు కష్టపడి తోలుచుండిరి. నిర్గ 14 : 24, 25.

## ఇశ్రాయేలీయులు అరణ్యంలో సంచారజీవితం గడిపిన 40 సంవత్సరాలు దేవుడే వారికి ఆకాశం నుండి ఆహారం (దేవదూతల ఆహారం ?) పంపించాడట !

యెహోవా మోషేను చూచి_ఇదిగో నేను ఆకాశము నుండి మీ కొరకు ఆహారమును కురిపించెదను....పడిన ఆ మంచు ఇగిరిపోయిన తరువాత నూగుమంచువలె సన్నని కణములు అరణ్యపు భూమి మీద కనబడెను. ఇశ్రాయేలీయులు దాని చూచినప్పుడు అది ఏమైనది తెలియక_ఇదేమి (మన్నా) అని ఒకరితో ఒకరు చెప్పుకొనిరి .. వారు ఓమెరుతో కొలిచినప్పుడు హెచ్చుగా కూర్చుకొనిన వానికి ఎక్కువగా మిగులలేదు. తక్కువగా కూర్చుకొనినవానికి తక్కువకాలేదు. వారు తమ తమ ఇంటివారి భోజనమునకు సరిగా కూర్చుకొని యుండిరి. మరియు మోషే_దీనిలో ఏమియు ఉదయము వరకు మిగుల్చుకొనకూడదని వారితో చెప్పెను. అయితే వారు మోషే మాట వినక కొందరు ఉదయము వరకు దానిలో కొంచెము మిగుల్చుకొనగా అది పురుగు పట్టి కంపుకొట్టెను. మోషే వారి మీద కోపపడగా వారు అనుదినము ఉదయమున ఒక్కొక్కడు తన ఇంటివారి భోజనమునకు తగినట్టుగా కూర్చుకొనిరి. ఎండ వేడిమికి అది కరిగెను. ఆరవ దినమున వారు ఒక్కొక్కనికి రెండేసి ఓమెరుల చొప్పున రెండంతలు ఆహారము కూర్చుకొనినప్పుడు....మోషే ఆజ్ఞాపించినట్లు ఉదయము వరకు దానిని ఉంచుకొనిరి, అది కంపు కొట్టలేదు, దానికి పురుగు పట్టలేదు....ప్రజలలో కొందరు ఏడవ దినమున దాని కూర్చుకొన వెళ్లగా వారికేమియు దొరకక పోయెను....ఇశ్రాయేలీయులు నివసింపవలసిన దేశమునకు తాము వచ్చు నలుబదియేండ్లు మన్నానే తినుచుండిరి

నిర్గ 16 : 4_35. (కీర్త 78 : 25 కూడ చూడండి)

## పాతబడని దుస్తులు

నలువది సంవత్సరములు నేను (యెహోవా) మిమ్ము అరణ్యములో నడి

పించితిని. మీ బట్టలు మీ ఒంటి మీద పాతగిలి పోలేదు. మీ మీ చెప్పులు మీ కాళ్లను పాతగిలి పోలేదు. ద్వితీ 29 : 5.

## మోషే చేతిలో దాగివున్న విజయ రహస్యం

తరువాత అమాలేకీయులు వచ్చి రెఫీదీములో ఇశ్రాయేలీయులతో యుద్ధము చేయగా....మోషే తన చెయ్యి పైకెత్తినప్పుడు ఇశ్రాయేలీయులు గెలిచిరి; మోషే తన చెయ్యి దింపినప్పుడు అమాలేకీయులు గెలిచిరి. మోషే చేతులు బరువెక్కగా వారు ఒక రాయి తీసికొనివచ్చి అతడు దానిమీద కూర్చుండుటకై దాని వేసిరి. అహరోను హూరులు ఒకడు ఈ ప్రక్కను ఒకడు ఆ ప్రక్కను అతని చేతులను ఆదుకొనగా అతని చేతులు సూర్యుడు అస్తమించు వరకు నిలకడగా ఉండెను. అట్లు యెహోషువ కత్తివాడి చేత అమాలేకు రాజును అతని జనులను గెలిచెను.

నిర్గ 17 : 8_13.

## కనబడే శబ్దాలు !

ప్రజలందరు ఆ ఉరుములు ఆ మెరుపులు ఆ బూర ధ్వనియు....చూచిరి.

నిర్గ 20 : 18.

## 1251 చదరపు గజాల గుడారంలో 30,00,000 మంది ఇశ్రాయేలీయులు కూడటమా ?

ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారమునొద్దకు సర్వసమాజమును సమకూర్చుమనగా యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు అతడు చేసెను. సమాజము ప్రత్యక్షపు గుడారము యొక్క ద్వారమునొద్దకు కూడిరాగా మోషే సమాజముతో_చేయవలెనని యెహోవా ఆజ్ఞాపించిన కార్యము ఇదే అనెను. లేవీ 8 : 3_5.

(ఆవరణపు పొడుగు నూరుమూరలు, దాని వెడల్పు ఏబదిమూరలు, దాని ఎత్తు ఐదు మూరలు నిర్గ 27 : 18.)

## ఒక్కడిని రాళ్లతో కొట్టి చంపడానికి 30,00,000 కావాలా ?

శపించిన వానిని పాళెము వెలుపలికి తీసికొనిరమ్ము....సర్వసమాజము వాని చావ గొట్టవలెను. యెహోవా నామమును దూషించువాడు మరణశిక్ష నొందవలెను.

సర్వసమాజము రాళ్లతో అట్టివానిని చావగొట్టవలెను.

లేవీ 24 : '4, 16. (సంఖ్యా 15 : 30-36 కూడ చూడండి)

## చిత్రలేఖనం, శిల్పం క్షమించరాని మతనేరాలు

పైనున్న ఆకాశమందేగాని క్రిందనున్న భూమియందేగాని, భూమి క్రింద నున్న నీళ్లయందేగాని యుండు దేనిపోలికనైన విగ్రహమును చేసికొనకూడదు.

ద్వితీ 5 : 8 (నిర్గ 20 : 4; ద్వితీ4 : 16-18, 23, 25 కూడచూడండి)

## అదృశ్యరూపుడు కనిపించడం, అతనికి పాదాలుండడం !

తరువాత మోషే అహరోను నాదాబు అబీహు ఇశ్రాయేలీయుల పెద్దలలో డెబ్బది మందియు ఎక్కిపోయి ఇశ్రాయేలీయుల దేవుని చూచిరి. ఆయన పాదముల క్రింద నిగనిగలాడు నీలమయమైన వస్తువు వంటిదియు ఆకాశమండలపు తేజము వంటిదియు ఉండెను. ఆయన ఇశ్రాయేలీయులలోని ప్రధానులకు ఏ హానియు చేయ లేదు. వారు దేవుని చూచి అన్నపానములు పుచ్చుకొనిరి. నిర్గ 24 : 9-11.

## వీపు చూపిన దేవుడు

మరియు యెహోవా—ఇదిగో నా సమీపమున ఒక స్థలమున్నది. నీవు ఆ బండమీద నిలువవలెను. నా మహిమ నిన్నుదాటి వెళ్లుమంతగా ఆ బండ సందులో నిన్నువుంచి, నిన్నుదాటి వెళ్లువరకు నా చేతితో నిన్ను కప్పెదను; నేను నా చెయ్యి తీసిన తరువాత నా వెనుక పార్శ్వమును చూచెదవుకాని నా ముఖము నీకు కనబడ దని మోషేతో చెప్పెను. నిర్గ 33 : 21-23.

**చాల అధ్యాయాలలో దేవుడుస్వయంగా తెలియజేశాడని చెప్పబడు తున్న అనేక విషయాలు అర్థరహితంగా వున్నాయి. ఉదా : కత్తెర చిప్పలు, దీప వృక్షము, తెరలు, గుడారము, మందసము, బలిపీఠము వగైరాల నిర్మాణానికి దేవుడిచ్చిన ఆజ్ఞలు.**

నిర్గ 25వ అధ్యాయము నుండి 40వ అధ్యాయము వరకు (మరికొన్ని చోట్ల కూడ ఇటువంటి ఆజ్ఞలు చూడగలము)

## దేవుడి ఉద్దేశ్యంలో వైభవం, సౌందర్యం

అలంకారము ఘనతయు కలుగునట్లు నీ సహోదరుడైన అహరోనుకు ప్రతిష్ఠిత వస్త్రములను కుట్టవలెను....అలంకారము ఘనతయు కలుగునట్లు కుళ్లాయిలను వారికి చేయవలెను. నిర్గ 23 : 2, 40.

## యాజకుల వస్త్రధారణను నిర్దేశించిన దేవుడు

మరియు వారి మానమును కప్పుకొనుటకు నీవువారికి నారలాగులను కుట్టవలెను, నిర్గ 28 : 42.

## దుస్తులు రక్తంతో తడిస్తే ఆ వ్యక్తులు పవిత్రపరచ బడ్డట్టేనా ?

ఆ పొట్టేలును వధించి దాని రక్తములో కొంచెము తీసి అహరోను కుడిచెవికొన మీదను అతని కుమారుల కుడిచెవుల కొనల మీదను, వారి కుడిచేతి బొటన వ్రేళ్ల మీదను, వారి కుడికాలి బొటన వ్రేళ్ల మీదను చమిరి బలిపీఠము మీద చుట్టు ఆ రక్తమును ప్రోక్షింపవలెను. మరియు నీవు బలిపీఠము మీద నున్న రక్తములోను అభిషేక తైలములోను కొంచెము తీసి అహరోను మీదను, అతని వస్త్రముల మీదను, అతనితోనున్న అతని కుమారుల మీదను, అతని కుమారుల వస్త్రముల మీదను ప్రోక్షింపవలెను. అప్పుడు అతడును అతని వస్త్రములును అతనితో నున్న అతని కుమారులును అతని కుమారుల వస్త్రములును ప్రతిష్ఠితములగును.

నిర్గ 29 : 20, 21.

అప్పుడు మోషే రక్తమును తీసికొని ప్రజలమీద ప్రోక్షించెను.

నిర్గ 24 : 8.

## రక్తంతో మీ పాపాలన్ని పోగొట్టుకోవచ్చు

మరియు ధర్మశాస్త్రప్రకారము సమస్త వస్తువులును రక్తముచేత శుద్ధిచేయబడుననియు, రక్తము చిందింపకుండ పాపక్షమాపణ కలుగదనియు సామాన్యముగా చెప్పవచ్చును. హెబ్రీ 9 : 22.

మేకలయొక్కయు, ఎడ్లయొక్కయు రక్తమును, మైలపడిన వారి మీద ఆవు

దూడ బూడిదె చల్లుటయు, శరీర శుద్ధి కలుగునట్లు వారిని పరిశుద్ధ పరచినయెడల నిత్యుడగు ఆత్మద్వారా తన్నుతాను దేవునికి నిర్దోషినిగా అర్పించుకొనిన క్రీస్తుయొక్క రక్తము, నిర్జీవ క్రియలను విడిచి జీవముగల దేవుని సేవించుటకు మీ మనస్సాక్షిని ఎంతో ఎక్కువగా శుద్ధిచేయును. హెబ్రీ 9:13,14.

అప్పుడు ఆయన కుమారుడైన యేసురక్తము ప్రతి పాపమునుండి మనలను పవిత్రులనుగా చేయును. 1 యోహా 1:7.

(లేవీ 9:8-22; 4:13-35; 8:19-24; 16:15-19; 14:25 కూడ చూడండి)

## ఒకజాతి పాపాలు మొత్తం ఒకమేకతో కొట్టుకు పోతాయి

అప్పుడు అహరోను సజీవమైన ఆ మేక తలమీద రెండు చేతులు ఉంచి, ఇశ్రాయేలీయుల పాపములన్నియు, అనగా వారి దోషములన్నియు, వారి అతిక్రమము లన్నియు దాని మీద ఒప్పుకొని, ఆ మేకతల మీద వాటిని మోపి, తగిన మనుష్యుని చేత అరణ్యములోనికి దాని పంపవలెను. ఆ మేక వారి దోషము లన్నిటిని ఎడారి దేశమునకు భరించిపోవును. లేవీ 16:21,22.

## దేవతా తైలం

మరియు మోషే అభిషేక తైలములో కొంతయు బలిపీఠముమీది రక్తములో కొంతయు తీసి, అహరోను మీదను అతని వస్త్రముల మీదను అతని కుమారుల మీదను అతని కుమారుల వస్త్రముల మీదను దానిని ప్రోక్షించి, అహరోనును అతని వస్త్రములను అతని కుమారులను అతని కుమారుల వస్త్రములను ప్రతిష్ఠించెను.

లేవి 8:30 (నిర్గ 30:22-25 కూడ చూడండి)

## పవిత్ర సువాసన ద్రవ్యం

మరియు యెహోవా మోషేతో ఇట్లనెను – నీవు పరిమళ ద్రవ్యములను, అనగా జటామాంసి గోపి చందనము గంధపుచెక్క అను ఈ పరిమళ ద్రవ్యములను స్వచ్ఛమైన సాంబ్రాణిని సమభాగములుగా తీసికొని .... నీవు చేయవలసిన ఆ ధూప ద్రవ్యమును దాని మేళనము చొప్పున మీ నిమిత్తము మీరు చేసికొనకూడదు. అది యెహోవాకు ప్రతిష్ఠితమైనదిగా ఎంచవలెను. దాని వాసన చూచుటకు దాని వంటిది చేయువాడు తన ప్రజలలోనుండి కొట్టివేయబడును. నిర్గ 30:35,37,38.

## విశ్రాంతి దినంనాడు భోజనం చెయ్యకూడదా ?

విశ్రాంతి దినమున మీరు మీ యిండ్లలో ఎక్కడను అగ్ని రాజబెట్టకూడదని వారితో చెప్పెను. నిర్గ 35 : 3.

## దేవుడి వ్రేలి మహత్తు

మరియు ఆయన సీనాయి కొండ మీద మోషేతో మాటలాడుట చాలించిన తరువాత ఆయన తన శాసనములుగల రెండు పలకలను, అనగా దేవుని వ్రేలితో వ్రాయబడిన రాతి పలకలను అతనికిచ్చెను. నిర్గ 31:18.

## అతి శీతలమైన కొండమీద 40 రోజులు ఉపవాసమున్న 80 యేండ్ల వృద్ధుడు!

అతడు నలుబది రేయింబగళ్ళు యెహోవాతో కూడ అక్కడ నుండెను. అతడు భోజనము చేయలేదు. నీళ్ళు త్రాగలేదు. నిర్గ 34:28.

## మెరిసిపోయే మోషే ముఖం

అహరోనును ఇశ్రాయేలీయులందరును మోషేను చూచినప్పుడు అతని ముఖచర్మము ప్రకాశించెను. గనుక వారు అతని సమీపింప వెరచిరి .... మోషే వారితో ఆ మాటలు చెప్పుట చాలించి తన ముఖము మీద ముసుగు వేసికొనెను. అయినను మోషే యెహోవాతో మాటలాడుటకు ఆయన సన్నిధిని ప్రవేశించినది మొదలుకొని అతడు వెలుపలికి వచ్చువరకు ఆ ముసుగు తీసివేసెను.

నిర్గ 34:30,33,34.

## ఏ ఇంటికైనా రోగాలు రాకుండ ఉండాలంటే ఇలా చెయ్యాలి

ఆ ఇంటి కొరకు పాప పరిహారార్థ బలి అర్పించుటకు అతడు రెండు పక్షులను దేవదారు కఱ్ఱను హిస్సోపును రక్తవర్ణపు నూలును సజీవమైన పక్షిని తీసికొని వధింపబడిన పక్షి రక్తములోను పారు నీటిలో వాటిని ముంచి ఆ యింటి మీద ఏడు మారులు ప్రోక్షింపవలెను. అట్లు ఆ పక్షి రక్తముతోను ఆ పారు నీటితోను సజీవ

మైన పక్షితోను దేవదారు కఱ్ఱతోను హిస్సోపుతోను రక్తవర్ణపు నూలుతోను ఆ యింటి విషయములో పాప పరిహారార్థబలి అర్పింపవలెను. లేవీ 14:49-52.

## సోదె మౌఢ్యమా, లేక పాపమా ?

సోదె చెప్పుట యనునది పాపము 1 సమూ 15:23.

శకునము చెప్పుదానిని బ్రదుకనియ్యకూడదు. నిర్గ 22:18.

అతడు (మనష్షే)....జ్యోతిషమును శకునములను వాడుకచేసి, యక్షిణిగాండ్ర తోను సోదెగాండ్రతోను సాంగత్యము చేసెను. 2 రాజు 21:6.

కర్ణపిశాచి గల వారి దగ్గరకు పోకూడదు, సోదెగాండ్రను వెదకి వారి వలన అపవిత్రత కలుగజేసికొనకూడదు. లేవీ 19:31.

## ఊరీము, ఏఫోదు మొదలైన వారి సోదె

యాజకుడైన ఎలియాజరు ఎదుట అతడు నిలువగా అతడు యెహోవా సన్నిధిని ఊరీము తీర్పువలన అతని కొరకు విచారింపవలెను. సంఖ్యా 27:21.

దేనితో నా ప్రభువు పానము చేయునో దేనివలన అతడు శకునములు చూచునో అది యిదే కదా ? ఆది 44:5.

మేము ప్రార్థనాస్థలమునకు వెళ్లుచుండగా (పుతోను అను) దయ్యము పట్టినదై, సోదె చెప్పుటచేత తన యజమానులకు బహులాభము సంపాదించుచున్న యొక చిన్నది మాకు ఎదురుగా వచ్చెను. అపొ 16:16.

## లాటరీ ద్వారా సోదె

ఎవనిని బట్టి ఇంత కీడు మనకు సంభవించినది తెలియుటకై మనము చీట్లు వేతము రండని యొకరితో ఒకరు చెప్పుకొని, చీట్లువేయగా చీటి యోనా మీదికి వచ్చెను. యోనా 1:7.

అంతటవారు వీరిని గూర్చి చీట్లు వేయగా మత్తీయ పేరిట చీటి వచ్చెను గనుక అతడు పదనొకండుమంది అపొస్తలులతో కూడ లెక్కింపబడెను. అపొ 1:26.

చీట్లు ఒడిలో వేయబడును, వాటివలని తీర్పు యెహోవా వశము.
సామె 16;33. (1 సమూ 14:41-43 కూడ చూడండి)

## నాలుగుకాళ్ళ పక్షులు!

రెక్కలు కలిగి నాలుగు కాళ్ళతో చరించు చరములన్నియు మీకు హేయములు
లేవీ 11 : 20.

## ఏవి పురుగుల్ని, మిడతల్ని తినవచ్చో తెలుసుకోండి

అయితే నాలుగు కాళ్లతో చరించుచు నేల గంతులు వేయుటకు కాళ్ళమీద తొడలుగల పురుగులన్ని .... నేత మిడతగాని చిన్న మిడతగాని ఆకు మిడతగాని మిడతలలో ప్రతివిధమైనది తినవచ్చును. నాలుగు కాళ్ళుగల పురుగులన్నియు మీకు హేయములు. లేవీ 11;21-23.

## మగబిడ్డకంటె ఆడబిడ్డను కనడం రెట్టింపు దోషం

యెహోవా మోషేకు ఈలాగు సెలవిచ్చెను - నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లనుము - ఒక స్త్రీ గర్భవతియై మగపిల్లను కనినయెడల ఆమె యేడు దినములు పురిటాలై యుండవలెను .... ఆమె ఆడుపిల్లను కనినయెడల ఆమె రెండు వారములు కడగా ఉండవలెను. లేవీ 12:1,2,5.

## ఆశపోతు యాజకవర్గం

కుమారుని కొరకేగాని కుమార్తె కొరకేగాని ఆమె శుద్ధి దినములు సంపూర్తియైన తరువాత ఆమెదహన బలిగా ఒక యేడాది గొర్రెపిల్లను, పాపపరిహారార్థ బలిగా ఒక పావురపు పిల్లనైనను తెల్లగువ్వనైనను ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారమునకు యాజకునియొద్దకు తీసికొని రావలెను .... ఆమె గొర్రెపిల్లను తేజాలని యెడల ఆమె రెండు తెల్లగువ్వలనైనను రెండు పావురపు పిల్లలనైనను దహనబలిగా ఒకదానిని, పాపపరిహారార్థబలిగా ఒకదానిని తీసికొనిరావలెను. యాజకుడు ఆమె నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయగా ఆమెకు పవిత్రత కలుగును. లేవీ 12:6,8.

[అప్పటికి ఉన్నది 30,00,000 మంది ప్రజలు కాగా వారికి యాజకత్వం నడిపేది ముగ్గురే (నిర్గ 28:1; లేవీ 10:2 చూడండి)] ఆ లెక్కన చూస్తే రోజూ, సుమారు 300 జననాలైనా వుండి వుండాలి. అంటే ఈ ముగ్గురు యాజకులు రోజూ కనీసం అర్ధ

వందల పాపురాలు అరగించే వారన్నమాట [(నిర్గ 29: 33; లేవీ 10:13, 17; 6:16; 8:31 కూడ చూడండి)]

## మాయాజాలపు నీరు—ఆ నీటితో స్త్రీలకు కఠిన పరీక్ష

వాని మనస్సులో రోషము పుట్టి అపవిత్ర పరచబడిన తన భార్యమీద కోప పడిన యెడల .... ఆ పురుషుడు యాజకునియొద్దకు తన భార్యను తీసికొనివచ్చి .... తరువాత యాజకుడు మంటి కుండతో పరిశుద్ధమైన నీళ్ళు తీసికొనవలెను, మరియు యాజకుడు మందిరములో నేలనున్న ధూళి కొంచెము తీసికొని ఆ నీళ్ళలో వేయ వలెను .... తరువాత యాజకుడు పత్రము మీద ఆ శపథములను వ్రాసి ఆ చేదు నీళ్ళతో వాటిని తుడిచి .... ఆ నీళ్ళు ఆ స్త్రీకి తాగింపవలెను. అతడు ఆమెకు నీళ్ళు త్రాగించిన తరువాత జరుగున దేదనగా, ఆమె అపవిత్ర పరచబడి తన భర్తకు ద్రోహము చేసిన యెడల, శాపము కలుగజేయు ఆ నీళ్ళు చేదై ఆమెలోనికి చేరిన తరువాత ఆమె కడుపు ఉబ్బును. ఆమె నడుము పడిపోవును. ఆ స్త్రీ తన జనుల మధ్య శాపమున కాస్పదముగా నుండును. సంఖ్యా 5:12-27.

## కందిరీగల సైన్యం

మరియు పెద్ద కందిరీగలను నీకు ముందుగా పంపెంచెదను. అవి నీ యెదుట నుండి హివ్వీయులను కనానీయులను హిత్తీయులను వెళ్లగొట్టును. నిర్గ 23:28.

## ఇంద్రజాలం చేసే యిత్తడి సర్పం

మోషే యిత్తడి సర్పమొకటి చేయించి స్తంభము మీద దానిని పెట్టెను. అప్పుడు సర్పపుకాటు తినిన ప్రతివాడు ఆ యిత్తడి సర్పమును నిదానించి చూచి నందున బ్రదికెను. సంఖ్యా 21:9.

## మాట్లాడే గాడిద !

గాడిద యెహోవా దూతను చూచి బిలాముతో కూడ క్రింద కూలబడెను. గనుక బిలాము కోపము మండి తన చేతి కఱ్ఱతో గాడిదను కొట్టెను. అప్పుడు యెహోవా ఆ గాడిదకు వాక్కు నిచ్చెను గనుక అది—నీవు నన్ను ముమ్మారు కొట్టి తివి; నేను నిన్నేమి చేసితినని బిలాముతో అనెను. సంఖ్యా 22:27, 28.

## తన చావుని, సమాధిని తనే వర్ణించుకున్న మోషే!

యెహోవా సేవకుడైన మోషే యెహోవా మాట చొప్పున మోయాబు దేశములో మృతి నొందెను. బెత్పయోరు యెదుట మోయాబు దేశములోనున్న లోయలో అతడు పాతిపెట్టబడెను. అతని సమాధి యెక్కడనున్నదో నేటివరకు ఎవరికి తెలియదు. ద్వితీ 34:5,6.

## నమ్రతగల నది!

అప్పుడు ఆ మందసమును మోయువారు యొర్దానులో దిగిన తరువాత మందసమును మోయు యాజకుల కాళ్లు నీటి అంచున మునగగానే పైనుండి పారు నీళ్లు బహుదూరమున .... ఏకరాశిగా నిలిచెను .... యాజకులు యొర్దాను మధ్య ఆరిన నేలను స్థిరముగా నిలిచిరి. జనులందరు యొర్దానును దాటుట తుద ముట్టువరకు ఇశ్రాయేలీయులందరు ఆరిన నేలమీద దాటుచు వచ్చిరి. యెహో 3:15–17

## సూర్యచంద్రుల్ని ఆపివేసిన యెహోషువ!

యెహోషువ యెహోవాకు ప్రార్థనచేసెను – సూర్యుడా, నీవు గిబియోనులో నిలువుము. చంద్రుడా, నీవు అయ్యాలోను లోయలో నిలువుము. జనులు తమ శత్రువుల మీద పగతీర్చుకొను వరకు సూర్యుడు నిలిచెను; చంద్రుడు ఆగెను అను మాట యాషారు గ్రంథములో వ్రాయబడి యున్నదిగదా. సూర్యుడు ఆకాశమధ్యమున నిలిచి యించుమించు ఒకనాడెల్ల అస్తమింప త్వరపడలేదు.

యెహో 10 : 12, 13.

## సర్వశక్తిమంతుడైన యెహోవా అశక్తత!

యెహోవా యూదా వంశస్థులకు తోడైయున్నందున వారు మన్య దేశమును స్వాధీనపరచుకొనిరి. అయితే మైదానమందు నివసించు వారికి ఇనుపరథము లున్నందున వారిని వెళ్లగొట్టలేక పోయిరి. న్యాయా 1:19.

## 1,00,000 కు పైగా వున్న సైన్యాన్ని 300 మంది మట్టి కరిపించారు!

ఘూడు వందలమంది బూరలను ఊదినప్పుడు యెహోవా దండంతటిలోను

ప్రతివాని ఖడ్గమును వాని పొరుగువాని మీదికి త్రిప్పెను. దండు....పారిపోయెను.
న్యాయా 7:22.

అప్పుడు కత్తిదూయు నూటఇరువది వేలమంది మనుష్యులు పడిపోయిరి.
న్యాయా 8:10.

## ముల్లుకర్ర దెబ్బకు 600 మంది హతం!

అతని తరువాత అనాతు కుమారుడైన షమ్గరు న్యాయాధిపతిగా ఉండెను.అతడు ఫిలిష్తీయులలో ఆరువందల మందిని మునుకోలు కర్రతో హతముచేసెను.
న్యాయా 3:30 31.

## దహించే అగ్నిని సైతం తట్టుకునే దేవదూత

ఆ దూత యొక ఆశ్చర్యకార్యము చేసెను. ఎట్లనగా జ్వాలలు బలిపీఠము మీద నుండి ఆకాశమునకు లేచుచుండగా యెహోవా దూత బలిపీఠము మీదనున్న ఆ జ్వాలలలో పరమునకు ఆరోహణమాయెను, న్యాయా 13: 9,20.

## ఆశ్చర్యం కలిగించే దవడ ఎముక

అతడు గాడిదయొక్క పచ్చిదవడ యెముకను కనుగొని చెయ్యిచాచి పట్టుకొని దానిచేత వెయ్యిమంది మనుష్యులను చంపెను. అప్పుడు సమ్సోను – గాడిదదవడ యెముకతో ఒక కుప్పను రెండు కుప్పలను నేను చంపియున్నాను. గాడిద దవడ యెముకతో వెయ్యిమంది నరులను చంపియున్నాను అనెను.
న్యాయా 15 : 15, 16.

## అద్భుత భుజబల సంపన్నుడు

సమ్సోను మధ్య రాత్రి వరకు పండుకొని మధ్యరాత్రి లేచి పట్టణపు తలుపులను వాటి రెండు ద్వారబంధములను పట్టుకొని వాటి అడ్డకర్రతోటి వాటిని ఊడబెరికి తన భుజములమీద పెట్టుకొని హెబ్రోనుకు ఎదురుగానున్న కొండ కొనకు వాటిని తీసికొని పోయెను. న్యాయా 16:3.

## ఎంత ఎక్కువగా జుట్టు పెంచితే అంత ఎక్కువగా భుజబలం పెరుగుతుంది.

దెలీలా–నీ మహాబలము దేనిలో నున్నదో నిన్ను దేనిచేత కట్టి బాధింప

వచ్చునో నాకు దయచేసి తెలుపుమని సమ్సోనుతోననగా సమ్సోను....నేను నా తల్లి గర్భము నుండి పుట్టినది మొదలుకొని దేవునికి నాజీరు చేయబడిన వాడనైయున్నాను నాతల మీదకి మంగలకత్తిరాలేదు, నాకు క్షౌరము చేసినయెడల నాబలము నాలో నుండి తొలగిపోయి ఇతర మనుష్యులవలె అవుదునని ఆమెతో అనెను. అతడు తన అభిప్రాయమును తనకు తెలిపెనని దెలీలాయెరిగి....తన తొడమీద అతని నిద్రబుచ్చి ఒక మనుష్యుని పిలిపించి వాని చేత అతని తలమీది యేడు జడలను క్షౌరము చేయించి అతని బాధించుటకు మొదలు పెట్టెను. అప్పుడు అతనిలో నుండి బలము తొలగిపోయెను....అప్పుడు ఫిలిష్తీయులు అతని పట్టుకొని అతని కన్నులను ఊడ దీసి గాజాకు అతని తీసికొనివచ్చి యిత్తడి సంకెళ్లచేత అతని బంధించిరి. అతడు బందీ గృహములో తిరుగలి విసరువాడాయెను. అయితే అతడు క్షౌరము చేయబడిన తరువాత అతని తలవెండ్రుకలు తిరిగి మొలుచుటకు మొదలు పెట్టెను....సమ్సోను ఆ గుడికి ఆధారముగా నున్న రెండు మధ్య స్తంభములు చేతను పట్టుకొని....బల ముతో వంగినప్పుడు గుడి ఆ సర్దారుల మీదను, దానిలోనున్న జనులందరిమీదను పడెను. మరణకాలమున అతడు చంపినవారి శవముల లెక్క జీవితకాలమందు అతడు చంపినవారి లెక్కకంటె ఎక్కువాయెను, న్యాయా 16:6-30.

## ఒక దేవుడంటే గిట్టని మరో దేవుడు !

ఫిలిష్తీయులు దేవుని మందసమును....తీసికొనివచ్చి దాగోనుగుడిలో దాగోను ఎదుట దానినుంచిరి. అయితే అష్డోదువారు ప్రాతఃకాలమందులేవగా, ఇదిగో దాగోనుయెహోవా మందసము యెదుట నేలను బోర్లబడి యుండెను. కనుక వారు దాగోనును లేవనెత్తి వాని స్థానమందు మరల ఉంచిరి. ఆ మరునాడు ఉదయము ననే లేవగా దాగోను యెహోవా మందసము ఎదుట నేలను బోర్లబడి యుండెను. దాగోనుయొక్క తలయు రెండుఅరచేతులును తెగవేయబడి గడపదగ్గరపడి యుండెను, వాని మొండెము మాత్రము వానికి మిగిలియుండెను. 1 సమూ 5:1-4.

## పెట్టెలోదాక్కున్న దేవుడు ఎలాంటి పాడుపని చేశాడో చూడండి !

జనులు ఇశ్రాయేలీయుల దేవుని మందసమును అక్కడినుండి గాతునకు తీసి కొనిపోయిరి. అయితేవారు అష్డోదునుండి గాతునకు దానిప మోసికొని పోయిన తరు వాత యెహోవా హస్తము ఆ పట్టణపు పెద్దలకు పిన్నలకు రహస్య స్థానములలో గడ్డలు లేపి వారిని మొత్తి గొప్పనాశనము చేసెను. 1 సమూ 5:8,9.

**40 అంకెమీద బైబిలు రచయితలకు మక్కువలాగుంది :**

మోషే నలువది సంవత్సరములు ఐగుప్తులోను....నలువది సంవత్సరములు మిద్యానులోను....నలువది సంవత్సరములు అరణ్యములోను గడిపెను.

అపొ 7:23, 30, 36.

ఒత్నీయేలు నలువది సంవత్సరములు ఇశ్రాయేలీయుల న్యాయాధిపతిగా నుండెను. న్యాయా 3:11.

బారాకు పాలనలో దేశము నలువది సంవత్సరములు నిమ్మళముగ నుండెను.

న్యాయా 5:31.

గిద్యోను దినములలో దేశము నలువది సంవత్సరములు నిమ్మళముగ నుండెను. న్యాయా 8:28.

యెహోవా ఇశ్రాయేలీయులను నలువది సంవత్సరములు ఫిలిష్తీయుల చేతికి అప్పగించెను. న్యాయా 13:1.

ఏలీ నలువది సంవత్సరములు ఇశ్రాయేలీయులకు న్యాయము తీర్చెను.

1 సమూ 4:18.

సౌలు నలువది సంవత్సరములు పరిపాలించెను. అపొ 13:21.

దావీదు నలువది సంవత్సరములు పరిపాలన చేసెను. 2 సమూ 5:4.

సొలొమోను ఇశ్రాయేలీయులను ఏలినకాలము నలువది సంవత్సరములు.

1 రాజు 11 : 42.

ఐగుప్తుదేశము నలువది సంవత్సరములు పాడైయుండును.

యెహె 29 : 12.

(పదేపదే కాలం లెక్కింపు ఖచ్చితంగా నలువది సంవత్సరాలై ఉండటాన్ని బట్టి బైబిలు కథనాన్ని పురాణ కథనంగా తీసుకోవచ్చనిపిస్తున్నది)

**అమాలేకీయులు చచ్చి మళ్ళీ లేచి వచ్చారా?**

సౌలు అమాలేకీయులను .... తరిమి హతము చేసి .... జనులందరిని కత్తి చేత నిర్మూలము చేసెను .... అమాలేకీయులను నిర్మూలము చేసెను.

1 సమూ 15 : 7, 8, 20.

దావీదును అతనివారును బయలుదేరి .... అమాలేకీయుల మీద పడిరి దావీదు ఆ దేశస్థులను హతముచేసి, మగవాని నేమి ఆడుదాని నేమి ఎవరిని బ్రతుకనియ్యలేదు ... ప్రాణముతో ఎవరిని లుగా విడువలేదు. 1 సమూ 27 : 8, 9.

అమాలేకీయులు దండెత్తి దక్షిణదేశము మీదను సిక్లగుమీదను పడి, కొట్టి దానిని తగులబెట్టి ఘనులనేమి అల్పులనేమి అందులోనున్న ఆడువారందరిని చెర పట్టుకొని చంపక వారిని తీసికొని వెళ్ళిపోయి యుండిరి .... దావీదు సంగతిని గ్రహించి సంధ్యవేళ మొదలుకొని మరునాటి సాయంత్రము వరకు వారిని హతము చేయుచుండగా, ఒంటెలమీద ఎక్కి పారిపోయిన నాలుగువందల మంది యౌవనులు తప్ప తప్పించు కొనినవాడు ఒక్కడును లేక పోయెను.

1 సమూ 30 : 1, 2, 17.

(ఆ తరువాత హిజ్కియా కాలములో అమాలేకీయులు సంపూర్తిగా నిర్మూలించబడ్డారని 1 దిన 4:43 చెబుతున్నది)

## నిర్మూలించబడిన మిద్యానీయులు మళ్ళీ అభివృద్ధి చెందారు!

యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు వారు మిద్యానీయులతో యుద్ధము చేసి మగవారినందరిని చంపిరి ...అప్పుడు ఇశ్రాయేలీయులు మిద్యాను స్త్రీలను .... దోచు కొనిరి. సంఖ్యా 31:7,9. (సంఖ్యా 31:17,18 కూడ చూడండి)

ఇశ్రాయేలీయులు యెహోవా దృష్టికి దోషులైనందున యెహోవా యేడేండ్లు వారిని మిద్యానీయుల కప్పగించెను .... వారు తమ పశువులను గుడారములను తీసి కొని మిడతల దండంత విస్తారముగా వారిమీదికి వచ్చెను.

న్యాయా 6 : 1, 3, 5.

## ఎదోమీయులలోని మగవాళ్ళందరినీ చంపినా వాళ్ళవంశం నాశనం కాలేదు!

ఎదోములోనున్న మగవారినందరిని హతము చేయువరకు ఇశ్రాయేలీయు లందరితో కూడ యోవాబు ఆరునెలలు అచ్చట నిలిచెను. 1 రాజు 11:16.

నేటి వరకు ఎదోమీయులు తిరుగుబాటు చేసి యూదావారికి లోబడకయే యున్నారు. 2 రాజు 8.22.

5)

## చనిపోయిన వారి ఆత్మలు మళ్లీ లేచివస్తాయి !

ఎన్దోరులో కర్ణపిశాచము గల యొకతె యున్నదని....సౌలు మారువేషము ధరించి వేరు బట్టలు తొడుగుకొని ఇద్దరు మనుష్యులను వెంట బెట్టుకొనిపోయి రాత్రివేళ ఆ స్త్రీ యొద్దకు వచ్చి-కర్ణపిశాచముద్వారా నాకు శకునము చెప్పి నాతో మాటలాడుటకై నేను నీతో చెప్పువాని రప్పించుమనికోరగా ఆ స్త్రీ-ఇదిగో సౌలు చేయించినది నీకు తెలిసినది కాదా ? కర్ణ పిశాచముగల వారిని చిల్లంగి వారిని అతడు దేశములో ఉండకుండ నిర్మూలము చేసెను గదా. నీవు ప్రాణము కొరకు ఉరి యొగ్గి నాకు మరణమేల రప్పింతువు అని అతనితో అనెను....ఆ స్త్రీ నీతో మాటలాడుటకై నేనెవని రప్పింపవలెనని యడుగగా అతడు-సమూయేలును రప్పింపవలెననెను. ఆ స్త్రీ సమూయేలును చూచినప్పుడు బిగ్గరగా కేకవేసి....దుప్పటి కప్పుకొనిన ముసలి వాడొకడు పైకివచ్చుచున్నాడనగా సౌలు-అతడు సమూయేలు అని తెలిసికొనెను.... సమూయేలు-నన్ను పైకిరమ్మని నీవెందుకు తొందరపెట్టితివని సౌలు నడిగెను.

1 సమూ 28;7-15.

## జనాభాలెక్కల సేకరణ భయంకరమైన నేరం !

దావీదు యోవాబునకును జనులయొక్క అధిపతులకును-మీరువెళ్లి ఇశ్రాయేలీయులను ఎంచి వారి సంఖ్య నాకు తెలియుటకై నాయొద్దకు దాని తీసికొనిరండని ఆజ్ఞ ఇచ్చెను....ఈ కార్యము దేవుని దృష్టికి ప్రతికూలమగుటచేత ఆయన ఇశ్రాయేలీయులను బాదపెట్టెను....కావున యెహోవా ఇశ్రాయేలీయుల మీదికి తెగులు పంపగా ఇశ్రాయేలీయులలో డెబ్బదివేలమంది చచ్చిరి. 1 దిన 2.:2,7,14.

## విధ్వంసక దేవదూతలు తెగుళ్ల కల్పిస్తారు.

యెరూషలేమును నాశనము చేయుటకై దేవుడు ఒక దూతను పంపెను. అతడు నాశనము చేయబోవుచుండగా యెహోవా చూచి ఆ చేటు విషయమై సంతాప మొంది నాశనము చేయుదూతతో-చాలును, ఇప్పుడు నీ చెయ్యి ఆపుమని సెలవియ్యగా ఆ దూత యెబూసీయుడైన ఒర్నాను కళ్లమునొద్ద నిలిచెను. దావీదు కన్నులెత్తి చూడగా, భూమ్యాకాశముల మధ్యను నిలుచుచు, వరదీసిన కత్తి చేతపట్టుకొని దానిని యెరూషలేము మీద చాపిన యెహోవాదూత కనబడెను. 1 దిన 21,15,16.

## జ్ఞానమెక్కువ - భార్యలెక్కువ !

దేవుడు జ్ఞానమును బుద్ధిని వర్ణింపశక్యముగాని వివేచనగల మనస్సును సొలొమోనుకు దయచేసెను. 1 రాజు 4:29.

అతనికి ఏడువందలమంది రాజకుమార్తెలైన భార్యలును మూడువందల మంది ఉపపత్నులును కలిగియుండిరి. 1 రాజు 11:3.

అతడు సమస్తమైనవారి కంటెను....జ్ఞానవంతుడై యుండెను.
1 రాజు 4:31.

## చిన్న గుడి పరిమాణంలో పెద్ద మందిరం !

రాజైన సొలొమోను యెహోవాకు కట్టించిన మందిరము అరువదిమూరల పొడుగును ఇరువది మూరల వెడల్పును ముప్పదిమూరల ఎత్తునుగలదై యుండెను. పరిశుద్ధ స్థలము ఎదుటనున్న ముఖమంటపము మందిరముయొక్క వెడల్పును బట్టి ఇరువదిమూరల పొడవు, మందిరము ముందర అది పది మూరల వెడల్పు.... మరియు మందిరమునకు చుట్టు గదులను కట్టించెను, ఇవి అయిదుమూరల యెత్తు గలవై దేవదారు దూలముల చేత మందిరముతో దిట్టముగా సంధింపబడెను.
1 రాజు 6:2,3,10.

(ఒక మూర అంటె అడుగున్నర. సొలొమోను కట్టించిన గొప్పమందిరము 90 అడు పొడవు, 30 అడుగుల వెడల్పు, 45 అడుగుల ఎత్తు కలిగి ఒక చిన్న సైజు గుడి అంత ఉంటుంది)

## చిన్న పనికోసం భారీఎత్తున ఏర్పాట్లు, 1,80.000 మందికి 11 సంవత్సరాలు ఉపాధి !

హీరాము సొలొమోనుకు ఇష్టమైనంత మట్టుకు దేవదారు మ్రానులను సరళవృక్షమ్రానులను పంపించగా సొలొమోను హీరామునకు అతని ఇంటివారి రక్షణకు ఆహారముగా రెండు లక్షల తూముల గోధుమలను మూడువేల ఎనిమిదివందల పళ్ల స్వచ్ఛమైన నూనెను పంపించెను. ఈ ప్రకారము సొలొమోను ప్రతి సంవత్సరము హీరామునకు ఇచ్చుచు వచ్చెను....రాజైన సొలొమోను ఇశ్రాయేలీయులందరి చేతను వెట్టిపని చేయించెను. వారిలో ముప్పదివేలమంది వెట్టిపని చేయువారైరి, వీరిని

అతడు వంతుల చొప్పున నెలకు పదివేల మందిని లెబానోనుకు పంపించెను.
1 రాజు 5:10-14.

బరువులు మోయుటకు డెబ్బదివేలమందిని, కొండల మీద మ్రానులు కొట్టుటకు ఎనుబదివేలమందిని ఏర్పరచుకొని వీరిమీద మూడువేల ఆరువందల మందిని అధిపతులుగా వుంచెను. 2 దిన 2:2.

ఏడు సంవత్సరములు సొలొమోను దానిని (మందిరమును) కట్టించుచుండెను.
1 రాజు 6:38.

## సొలొమోను సంపద

ఏటేట సొలొమోనుకు వచ్చు బంగారము వెయ్యిన్ని మూడువందల మువ్వది రెండు మణుగుల యెత్తు....ఈ ప్రకారము రాజైన సొలొమోను ధనము చేతను, జ్ఞానము చేతను భూపతులందరిలో అధికుడై యుండెను. 1 రాజు 10:14,23.

(విద్య, నాగరికత అభివృద్ధిచెందని, చెప్పుకోదగ్గ ఉత్పత్తులు లేని ఆసియామైనరులోని ఒక చిన్న ప్రాంతానికి అధిపతిగా వున్న వ్యక్తికి సంవత్సరాదాయం ఆ రోజుల్లో 8,00,00,000 రు.ల పైగా ధనరూపంలోను, అదిగాక మణుగుల కొద్దీ బంగారం, గంధ వర్గములు, రత్నాల వంటివికాగా రోమన్లకు మాత్రం ఆసియాలో తమకు లోబడివున్న రాష్ట్రాలన్నిటి నుంచీ కలుపుకున్నా వారి సంవత్సరాదాయం 9,00,00,000 రు.లు మాత్రమేనట !)

## షెబదేశపు రాణి సొలొమోనుకు ఇచ్చిన బహుమతుల విలువ సుమారు 2,00,00,000 రు.లు

షెబదేశపు రాణి సొలొమోనును గూర్చిన ప్రసిద్ధిని వినినప్పుడు గూఢమైన ప్రశ్నలచేత సొలొమోనును శోధింపవలెనని .... వచ్చెను.... సొలొమోను ఆమె ప్రశ్నలన్నియు ఆమెకు విడదీసి చెప్పెను ; సొలొమోను ఆమెకు ప్రత్యుత్తరము చెప్పలేని మరుగైన మాటయేదియు లేక పోయెను. షెబదేశపు రాణి సొలొమోనుకు కలిగిన జ్ఞానమును, అతడు కట్టించిన నగరును, అతని బల్లమీది భోజన పదార్థములను, అతని సేవకులు కూర్చుండుటను, అతని యుపచారులు కని పెట్టుటను వారి వస్త్రములను అతనికి గిన్నెలనందించువారిని వారి వస్త్రములను, యెహోవా మందిరమందు అతడు అర్పించు దహనబలులను చూచినప్పుడు ఆమె

విస్మయమొంది....రాజునకు రెండువందల నలుబది మణుగుల బంగారమును విస్తారమైన గంధ వర్గములను రత్నములను ఇచ్చెను. 2 దిన 9:1-9.

(ఈ షేబదేశం భూమండలంలో ఎక్కడున్నదో తెలియదు !)

## భూమ్మీదవున్న రాజులందరు (!) సొలొమోనుకు కప్పము చెల్లించేవారట

దేవుడు సొలొమోనుయొక్క హృదయమందుంచిన జ్ఞానోక్తులను వినుటకై భూరాజులందరును ఆతని ముఖదర్శనము చేయగోరిరి. మరియు ప్రతివాడును ఏటేట వెండివస్తువులను బంగారు వస్తువులను వస్త్రములను ఆయుధములను గంధవర్గములను గుఱ్ఱములను కంచరగాడిదలను కానుకలుగా తీసికొని వచ్చెను.

2 దిన 9 : 23, 24.

## మందిర నిర్మాణానికి ఇచ్చిన బంగారం, వెండి మొదలైన వాటి విలువ సుమారు 120,00,00,000 రూపాయలట!

రాజైన దావీదు .... దేవుని మందిరము నిమిత్తము .... గదుల గోడల రేకు మూతకును బంగారపు పనికిని బంగారమును, వెండి పనికి వెండిని, పనివారు చేయు ప్రతివిధమైన పనికి ఆరువేలమణుగుల ఓఫీరు బంగారమును పదునాలుగు వేల మణుగుల పుటము వేయబడిన వెండిని....అప్పుడు పితురుల ఇండ్లకు అధిపతులును ఇశ్రాయేలీయుల గోత్రపు అధిపతులును .... మనః పూర్వకముగా దేవుని మందిరపు పనికి పదివేల మణుగుల బంగారమును ఇరువదివేల మణుగుల వెండిని ముప్పది యారువేల మణుగుల యిత్తడిని రెండులక్షల మణుగుల యినుమును ఇచ్చిరి.

1 దిన 29:1-7.

## దావీదు మందిర నిర్మాణానికి 1400,00,00,000 రు.ల విలువైన బంగారాన్ని 900,00,00,000 రు.ల విలువైన వెండిని ఇచ్చాడట!

ఇదిగో నేను నా కష్టస్థితిలోనే ప్రయాసపడి యెహోవా మందిరము కొరకు రెండు లక్షల మణుగుల బంగారమును పదికోట్ల మణుగుల వెండిని తూచశక్యముగానంత విస్తారమైన యిత్తడిని యినుమును సమకూర్చియున్నాను.

1 దిన 22 : 14.

(బ్రిటన్ ద్వీపాల్లో వున్న బంగారం, వెండిల మొత్తం విలువ 286 కోట్ల రూపాయలకు మించదని మాంగ్రెడియన్ అంచనా. నాగరిక ప్రపంచంలో అత్యధిక భాగ్యవంతమైన బ్రిటన్‌లోకంటె ఆటవిక సిరియను జాతినాయకుడివద్ద అంత ఎక్కువ బంగారం, వెండి వుంటుందా ? బహుశా అతనిద్ద నాగరిక ప్రపంచం మొత్తం మీద వున్న బంగారానికి మించే వుండాలి !)

## ఏలీయాకు మాంసాహారం తెచ్చియిచ్చిన కాకులు !

అక్కడ కాకోలములు ఉదయమందు రొట్టెను, మాంసమును అస్తమయ మందు రొట్టెను మాంసమును అతని యొద్దకు తీసికొని వచ్చుచుండెను; అతడు వాగునీరు త్రాగుచువచ్చెను. 1 రాజు 17:6.

## ఎంత తిన్నా తరగని ఆహారం !

అందుకామె - నీ దేవుడైన యెహోవా జీవముతోడు తొట్టిలో పట్టెడు పిండియు బుడ్డిలో కొంచెము నూనెయు నా వద్ద నున్నవేగాని అప్పమొకటైన లేదు, మేము చావకముందు నేను ఇంటికిపోయి వాటిని నాకును నా బిడ్డకును సిద్ధము చేసి కొనవలెనని కొన్ని పుల్లలు ఏరుటకై వచ్చితిననెను. అప్పుడు ఏలియా ఆమెతో యిట్లనెను - భయపడవద్దు, పోయి నీవు చెప్పినట్లు చేయుము; అయితే అందులో నాకొక చిన్నఅప్పము మొదటచేసి నా యొద్దకు తీసికొని రమ్ము, తరువాత నీకును నీ బిడ్డకును అప్పములు చేసికొనుము .... అంతట ఆమె వెళ్ళి ఏలియా చెప్పినమాట ప్రొప్పున చేయగా అతడును ఆమె ఆమె ఇంటివారును అనేకదినములు భోజనము చేయుచు వచ్చిరి. యెహోవా ఏలీయాద్వారా సెలవిచ్చిన ప్రకారము తొట్టిలోవున్న పిండి తక్కువ కాలేదు, బుడ్డిలోవున్న నూనె అయిపోలేదు

1 రాజు 17 : 12-16.

## ఏలియా ఆకాశమునుంచి రప్పించిన అగ్ని తడి కట్టెలను, రాళ్లను, బుగ్గిని కనబడకుండ కాల్చేసిందట!

కట్టెలను క్రమముగా పేర్చి యెద్దును తునకలుగా కోసి ఆ కట్టెల మీదవుంచి, జనులు చూచుచుండగా – మీరు నాలుగు తొట్లనిండ నీళ్ళునింపి దహనబలి పశు మాంసము మీదను కట్టెల మీదను పోయుడని చెప్పెను .... యెహోవా అగ్ని దిగి,

దహనబలి పశువును కట్టెలను రాళ్ళను బుగ్గిని దహించి కందకమందున్న నీళ్లను ఆరిపోచేసెను. 1 రాజు 18:33,38.

## ఇంద్రజాలపు దుప్పటిదెబ్బకు రెండుగా చీలిపోయినది !

అంతట ఏలియా తన దుప్పటి తీసికొని మడతపెట్టి నీటి మీద కొట్టగా అది ఇవతలుకును అవతలకును విడిపోయెను గనుక వారిద్దరు పొడినేలమీద దాటి పోయిరి. 2 రాజు 2:8.

## షరతులతో కూడిన ఆత్మ జ్ఞానము, అగ్నిగుఱ్ఱములు, సుడిగాలితో పాటు ఏలియా ఆకాశప్రయాణం, మాయాదుప్పటి లాంటి గుమ్మత్తులు !

వారు దాటిపోయిన తరువాత ఏలీయా ఎలీషాను చూచి_ నేను నీ యొద్దనుండి తీయబడక మునుపు నీకొరకు నేనేమి చేయకోరుదవో దాని నడుగుమని చెప్పగా ఎలీషా_నీకు కలిగిన ఆత్మలో రెండు పాళ్లనా మీదికి వచ్చునట్లు దయచేయుమనెను, అందుకతడు_నీవు అడిగినది కష్టతరముగానున్నది; అయితే నీయొద్ద నుండి తీయ బడినప్పుడు నేను నీకు కనబడినయెడల ఆ ప్రకారము నీకు లభించును, కనబడని యెడల అదికాక పోవునని చెప్పెను. వారు ఇంక వెళ్లుచు మాటలాడుచుండగా ఇదిగో అగ్ని రథమును అగ్ని గుఱ్ఱములను కనబడి వీరిద్దరిని వేరుచేసెను; అప్పుడు ఏలీయా సుడిగాలి చేత ఆకాశమునకు ఆరోహణమాయెను. ఎలీషా అది చూచి....ఏలీయా దుప్పటి క్రింద పడగా అతడుదాని తీసికొని....ఆ దుప్పటితో నీటిని కొట్టగా అది ఇటుఅటు విడిపోయినందున ఎలీషా అవతలి యొడ్డునకు నడచిపోయెను.

2 రాజు 2:9_14.

## కుష్ఠు శాపం

కాబట్టి నయమానునకు కలిగిన కుష్ఠు నీకును నీ సంతతికిని సర్వకాలము అంటియుండును. అని చెప్పగా వాడు మంచువలె తెల్లనైన కుష్ఠము కలిగి ఎలీషా ఎదుట నుండి బయటకు వెళ్లెను. 2 రాజు 5:27.

## ఇనుము నీటిలో తేలుతుంది

ఒకడు దూలమునరకు చున్నప్పుడు గొడ్డలి ఊడి నీటిలో పడిపోగా వాడు_

అయ్యో నా యేలినవాడా, అది యెరవు తెచ్చినదని మొరపెట్టెను. గనుక ఆ దైవ జనుడు – అదెక్కడ పడెనని అడిగెను; వాడు అతనికి ఆ స్థలమును చూపింపగా అతడు కొమ్మయొకటి నరికి నీళ్ళలో వేయగా గొడ్డలి తేలెను.

2 రాజు 6 : 5, 6.

## సైన్యం మొత్తం ఒక్కసారిగా గుడ్డివాళ్ళయి పోయారట!

కాబట్టి రాజుఅచ్చటికి గుర్రములను రథములను గొప్ప సైన్యమును పంపెను. వారురాత్రివేళ వచ్చి నలుదిశలను పట్టణమును చుట్టుకొనగా....ఆ దండువారు అతని సమీపించినప్పుడు ఎలీషా – ఈ జనులను అంధత్వములో మొత్తుమని యెహోవాను వేడుకొనగా ఆయన ఎలీషా చేసిన ప్రార్థన చొప్పున వారిని అంధత్వములో మొత్తెను. అప్పుడు ఏలీషా ఇది మార్గముకాదు; ఇది పట్టణము కాదు, మీరు నా వెంట వచ్చిన యెడల మీరు వెదకు వానియొద్దకు మిమ్మును తీసికొని పోదునని వారితో చెప్పి షోమ్రోను పట్టణమునకు వారిని నడిపించెను. వారు షోమ్రోనులోనికి వచ్చినప్పుడు– యెహోవా వీరు చూచునట్లు వీరికండ్లను తెరువుమని ప్రార్థనచేయగా యెహోవా వారి కండ్లను తెరవచేసెను గనుక వారు తాము షోమ్రోను మధ్య ఉన్నామని తెలిసికొనిరి.

2 రాజు 6 : 14–20.

## 1,85,000 మంది సైన్యాన్ని ఒక్కరాత్రిలో హతం చేసిన దైవ దూత !

ఆ రాత్రియే యెహోవా దూత బయలుదేరి అష్షూరు వారు దండుపేటలోజొచ్చి లక్షయెనుబది యయిదు వేలమందిని హతముచేసెను. ఉదయమున జనులు లేచి చూడగా వారందరును మృతకళేబరములై యుండిరి.

2 రాజు 19 : 35.

## చిన్న రాజ్యాలకు పెద్ద సైన్యాలు!

అబీయాకును యరొబామునకును యుద్ధము కలుగగా అబీయా నాలుగు లక్షల మంది పరాక్రమశాలుల సైన్యము ఏర్పరచుకొని యుద్ధమునకు సిద్ధముచేసెను. యరొబాము ఎనిమిదిలక్షల మంది పరాక్రమశాలులను ఏర్పరచుకొని అతనికి ఎదురుగా వారిని యుద్ధమునకు వ్యూహపరచెను.

2 దిన 13 : 3.

## నమ్మశక్యంగాని వధలు :

అబీయాయును అతని జనులును వారిని ఘోరముగా సంహరించిరి. ఇశ్రాయేలువారిలో అయిదులక్షలమంది పరాక్రమశాలులు హతులైరి. 2 దిన 13:17.

## గోడకూలగా 27,000 వేలమంది హతం :

అచ్చటనున్న యొక ప్రాకారము శేషించినవారిలో ఇరువది యేడువేలమంది మీదపడెను. 1 రాజు 20:30.

## వెనక్కు ప్రయాణించిన సూర్యుడు

హిజ్కియా కన్నీళ్లువిడిచెను....పిమ్మట యెషయా అంజూరపు పండ్లముద్ద తెప్పించుడని చెప్పగా వారు దానితెచ్చి కురుపుమీద వేసిన తరువాత అతడు బాగుపడెను. యెహోవా నన్ను స్వస్థపరచుననుటకు....సూచన ఏదని హిజ్కియా యెషయాను అడుగగా....ప్రవక్తయగు యెషయా యెహోవాను ప్రార్థింపగా ఆయన ఆహాజు గడియారపు పలకమీద పదిమెట్లు ముందరికి నడిచిన నీడ పదిమెట్లు వెనుకకు తిరిగిపోవునట్లు చేసెను. 2 రాజు 20:3-11.

## దేవుడి దృష్టిలో బాలుడి దుర్మార్గం

యెహోయాకీను ఏలనారంభించి నప్పుడు ఎనిమిదేండ్లవాడై యెరూషలేములో మూడు నెలల పది దినములు ఏలెను. అతడు యెహోవా దృష్టికి చెడు నడత నడిచెను. 2 దిన 36:9.

## దేవుడికి సాతానుకి మధ్య స్నేహసంబంధాలు వున్నాయా ?

దేవదూతలు (దైవకుమారులు) యెహోవా సన్నిధిని నిలుచుటకై వచ్చిన దినమొకటి తటస్థించెను. ఆ దినమున అపవాది (సాతాను) యగువాడు వారితో కలిసి వచ్చెను. యెహోవా-నీవు ఎక్కడ నుండి వచ్చితివనివానినడుగగా అపవాది-భూమి మీద ఇటుఅటు తిరుగులాడుచు అందులో సంచరించుచువచ్చితినని యెహోవాకు ప్రత్యుత్తరమిచ్చెను. యోబు 1:6,7.

## ఆసక్తి కలిగించే సౌందర్య వర్ణన !

నా సఖీ నీవు తిర్సా పట్టణమువలె సుందరమైనదానవు యెరూషలేమంత సౌందర్యవంతురాలవు .... నీ తల వెంట్రుకలు గిలాదు పర్వతముమీది మేకల మందను పోలియున్నవి. నీ పలువరుస కత్తెర వేయబడినవియు కడుగబడియప్పుడే పైకి వచ్చినవియునై ....నీ నేత్రములు .... తటాకములతో సమానములు. నీ నాసిక దమస్కు దిక్కునకు చూచు లెబానోను శిఖరముతో సమానము.

పరమ 6:4-6; 7:4.

## కథల్లో చెప్పబడ్డ కల్పిత జంతువులకి నేడు మనం చూస్తున్న నిజమైన జంతువులకి లంకె!

### 1. UNICORN :

గురుపోతు నీకు లోబడుటకు సమ్మతించునా ? అది నీ శాలలో నిలుచునా? పగ్గములేసి గురుపోతును నాగటిచాలుతో కట్టగలవా? అది నీ చేత తోలబడి లోయలను చదరము చేయునా? దానిబలము గొప్పదని దానినమ్ముదువా? దానికి నీ పని అప్పగించెదవా? యోబు 39:9-11.

గురుపోతు కొమ్ములలో నుండి రక్షించినాకు త్తరమిచ్చియున్నావు.
కీర్త 22:21.

గురుపోతు కొమ్మువలె నీవు నా కొమ్ము పైకెత్తితివి. కీర్త 92:10.

[సంఖ్యా 23:22; 24:8; కీర్త 29:6; ద్వితీ 33:17 మరియు యెష 34:7 చూడండి.]

(ఆంగ్లంలో వున్న Unicorn అనే జంతువును తెలుగులో గురుపోతు అని అనువాదం చేశారు. కాని Unicorn అనేదానికి గుఱ్ఱం ఆకారం కలిగి నెత్తిమీద తిన్నగా పొడుచుకు వచ్చిన ఒక కొమ్ము కలిగిన జంతువు అని నిఘంటువు అర్థం)

### 2. COCKATRICE

ఎద్దుమేయునట్లు సింహము గడ్డిమేయును. పాలు కుడుచుపిల్ల నాగుపాము పుట్టయొద్ద ఆట్లాడును. మిడినాగు పుట్టమీద పాలు విడిచిన పిల్ల తన చెయ్యిచాచును.
యెష 11 : 78

(ఆంగ్లంలో Cockatrice అని వున్న పదానికి పరిశుద్ధ గ్రంథంలో మిడినాగు అని అనువాదం చేశారు. నిఘంటువు ప్రకారం అది పక్షి గుడ్డును పాము పొదగగా ఏర్పడిన

జంతువు. బైబిలు రివైజ్డ్ వెర్షన్‌లో Cockatrice కు బదులు Basilisk అని ప్రతి క్షేపించబడింది. దాని చూపుతోనే సమస్త ప్రాణులు చచ్చిపోతాయట దాని తల, కాళ్లు, రెక్కలు పక్షివలెను, మొండెము, తోక పాముకు వలెను వుంటాయి. వీటి ప్రస్తావన యెష 14:29; 59:5; యిర్మీ 8:17లలో కనిపిస్తుంది.)

## 3. DRAGON

అది అడవి కుక్కలకు నివాసస్థలముగాను నిప్పుకోళ్లకు సాలగాను ఉండును.
యెష 34:13.

కొదమ సింహములను భుజంగములను అణగద్రొక్కెదవు.
కీర్త 91 : 13

నేను ఏర్పరచుకొనిన ప్రజలు త్రాగుటకు అరణ్యములో నీళ్లు పుట్టించు చున్నాను. ఎడారిలో నదులు కలుగజేయుచున్నాను. అడవి జంతువులును అడవి కుక్కలును నిప్పుకోళ్లును నన్ను ఘనపరచును. యెష 43:20.

జలములలో భుజంగముల శిరస్సులను నీవు పగులగొట్టితివి.
కీర్త 74 : 13.

నాగుపాముల క్రూరవిషము ద్వితీ 32 : 33.

దీని చూచి నేను కేకలు వేయుచు ప్రలాపించుచున్నాను, ఏమియు లేకుండ దిగంబరినై నక్కలు అరచునట్లు అరచుచున్నాను. నిప్పుకోడి మూల్గునట్లు మూల్గు చున్నాను. మీకా 1 : 8.

నేను నక్కలకు సోదరుడనైతిని. నిప్పుకోళ్ళ జతకాడనైతిని.
యోబు 30 : 29.

తీవ్ర సర్పమైన మకరమును వంకర సర్పమైన మకరమును ఆయన దండించును. యెష 27 : 1.

(ఆంగ్లంలో Dragon అని పేర్కొన్న జంతువును తెలుగులో అడవి కుక్క, నక్క, భుజంగము, మకరము మరియు నాగుపాము అని పరిశుద్ధ గ్రంథంలో అనువదించారు. కాని Dragon అంటె రెక్కలతో కూడిన భయంకరమైన పాము అనిఅర్థం. యెష 27:1; యిర్మీ 9:11; 10:22 కూడ చూడండి).

## 4. SATYRS

అడవి పిల్లులను నక్కలును అచ్చట కలిసికొనును, అచ్చట అడవి మేకతన తోటి జంతువును కనుగొనును. అచ్చట చువ్వపిట్ట దిగి విశ్రమస్థలము చూచు కొనును. యెష 34 : 14.

నిప్పుకోళ్ళు అక్కడ నివసించును. కొండమేకలు అక్కడ గంతులువేయును. యెష 13: 21.

(అంగ్లంలో Satyr అనేదానికర్థం వనదేవత. దాన్ని తెలుగులో అడవిమేక, కొండమేక అని అనువదించారు.)

## 5. FIERY SERPENT

అందుకు యెహోవా ప్రజలలోనికి తాపకరములైన సర్పములను పంపెను, అవి ప్రజలను కరువగా ఇశ్రాయేలీయులలో అనేకులు చనిపోయిరి.

సంఖ్యా 21 : 6.

తాపకరమైన పాములును తేళ్ళును కలిగి యెడారియై నీళ్ళులేక భయంకరమైన ఆ గొప్ప అరణ్యములో అయననిన్ను నడిపించెను. ద్వితీ 8 : 15.

(Fiery Serpent ను తాపకరమైన సర్పములని పరిశుద్ధ గ్రంథంలో అనువదించారు. అవి ఎటువంటివో ఎవరికి తెలియదు)

## 6. WINGED SERPENT

సింహీసింహములును పాములును తాపకరమైన మిడు నాగులునున్న .... దేశము, యెష 30:6.

సర్పబీజమునుండి మిడునాగు పుట్టును. దాని ఫలము ఎగురు సర్పము. యెష 14 : 29.

(Winged Serpent అంటె రెక్కలు గల సర్పము అని అర్థం. దాన్నిమిడునాగు అని కూడ అనువదించారు)

## గర్జించే దేవుడు

యెహోవా శూరునివలె బయలుదేరును....ఆయన హుంకరించుచు తన శత్రువులను ఎదిరించును, యెష 42:13.

ఉన్నత స్థలములో నుండి యెహోవా గర్జించుచున్నాడు....తన మంద మేయు స్థలమునకు విరోధముగా గర్జించుచున్నాడు. యిర్మీ 25:30.

వారు యెహోవా వెంబడి నడిచెదరు;సింహము గర్జించునట్లు ఆయన ఘోషించును, ఆయన ఘోషింపగా పశ్చిమ దిక్కునను న్న జనులు వణుకుచు వత్తురు. హోషే 11:10.

యెహోవా సీయోనులో నుండి గర్జించుచున్నాడు. యోవే 3 : 16.

## ఈలవేసే దేవుడు

ఆయన దూరముగానున్న జనులను పిలుచుటకు ధ్వజమునెత్తును. భూమ్యంతమునుండి వారిని రప్పించుటకు ఈలగొట్టును యెష 5:26.

ఆ దినమున ఐగుప్తునదులు అంతమందున్న జోరీగలను, అష్షూరు దేశములోని కందిరీగలను యెహోవా పిలుచును. అవి అన్నియు వచ్చి... నిలుచును. యెష 7:18,19.

## మంగలి దేవుడు

ఆ దినమున యెహోవానది (యూఫ్రటీసు) అద్దరినుండికూలికి వచ్చుమంగలి కత్తిచేతను, అనగా అష్షూరురాజు చేతను తల వెండ్రుకలను కాళ్ళ వెండ్రుకలను క్షౌరము చేయించును, అది గడ్డము కూడను గీచివేయును. యెష 7:20.

## విచిత్రమైన కృప

ఐగుప్తుదేశపు తొలి చూలులను ఆయన హతము చేసెను. ఆయన కృప నిరంతరముండును. కీర్త 136:10.

ప్రసిద్ధినొందిన రాజులను ఆయన హతము చేసెను. ఆయన కృపనిరంతరముండును. కీర్త 136:18.

## ఆకాశము, పర్వతములు, నీళ్ళు, జంతువులు అన్నీ దేవుడిని ప్రార్ధిస్తాయట !

పరమాకాశములారా, ఆకాశముపైనున్న జలములారా, ఆయనను

స్తుతించుడి....భూమిమీదనున్న మకరములారా, అగాధజలములారా, యెహోవాను స్తుతించుడి. అగ్ని వడగండ్లారా, హిమమా, ఆవిరీ, ఆయన ఆజ్ఞను నెరవేర్చు తుఫానూ, పర్వతములారా, సమస్తమైన గుట్టలారా, ఫలవృక్షములారా, సమస్తమైన దేవదారు వృక్షములారా, మృగములారా, పశువులారా, నేలను ప్రాకు జీవులారా, రెక్కలతో ఎగురు పక్షులారా....అందరును యెహోవానామమును స్తుతించుదురుగాక. కీర్త 148:4-13.

## పశ్చాత్తాపపడే దేవుడు

సంతాపపడి నేను విసికియున్నాను. యిర్మీ 15:6.

తాను భూమి మీద నరులను చేసినందుకు యెహోవా సంతాపము నొంది తన హృదయములో నొచ్చుకొనెను. ఆది 6:6.

[యోనా 3:10; నిర్గ 32:14; 1 సమూ 15:35 మరియు ఆమో 7:3 కూడ చూడండి]

## కోపిష్ఠి దేవుడు

యెహోవా....మహోగ్రత గలవాడు. నహూ 1:2.

## క్రూరమృగం వంటి దేవుడు

నా ప్రాణమునకు ఆయన పొంచియున్న ఎలుగు బంటివలె ఉన్నాడు. చాటైన చోటులలో నుండు సింహమువలె ఉన్నాడు. విలా 3:10.

(హోషే 5 : 14 కూడ చూడండి)

## మాంసాహారి దేవుడు

పిల్లలుపోయిన యెలుగుబంటి యొకనిమీద పడునట్టు నేను వారిమీద పడి వారి రొమ్మును చీల్చి వేయుదును; ఆడు సింహము ఒకని మ్రింగి వేయునట్లు వారిని మ్రింగివేతును; దుష్టమృగములు వారిని చీల్చివేయును. హోషే 13:8.

## తన ప్రవక్తలనే మోసగించే దేవుడు !

యెహోవా నీవు నన్ను ప్రేరేపింపగా నీ ప్రేరేపణకు నేను లోబడితిని; నీవు బలవంతము చేసి నన్ను గెలిచితివి. నేను దినమెల్ల నవ్వులపాలైతిని, అందరు నన్ను ఎగతాళి చేయుదురు. యిర్మీ 20:7.

## కాడి తగిలించుకున్న ప్రవక్త

యెహోవానాకు ఈఆజ్ఞ ఇచ్చుచున్నాడు—నీవుకాడిని పలుపులను చేయించుకొనినీ మెడకు కట్టుకొనుము....ప్రవక్తయైన హనన్యాప్రవక్తయైన యిర్మీయా మెడ మీద నుండి ఆ కాడిని తీసి దాని విరిచెను. యిర్మీ 27:2; 28:10.

## తెలివితక్కువ పనికి దేవుడి ప్రేరణ !

రెండవమారు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై - నీవు కొని నడుమున కట్టుకొనిన నడికట్టును తీసికొని, లేచి యూఫ్రటీసునొద్దకు పోయి అక్కడనున్న బండ బీటలో దానిని దాచి పెట్టుమనగా యెహోవా నాకాజ్ఞాపించినట్లు నేను పోయి యూఫ్రటీసునొద్దదాని దాచి పెట్టితిని. అనేక దినములైన తరువాత యెహోవా - నీవు లేచి యూఫ్రటీసు నొద్దకుపోయి, నేను అక్కడ దాచిపెట్టుమని నీ కాజ్ఞాపించిన నడి కట్టును అక్కడనుండి తీసికొనుమని నాతో చెప్పగా నేను యూఫ్రటీసునొద్దకు పోయి త్రవ్వి ఆ నడి కట్టును దాచి పెట్టినచోట నుండి దాని తీసికొంటిని. నేను దానినిచూడగా ఆ నడికట్టు చెడిపోయి యుండెను. అది దేనికిని పనికిరాని దాయెను.

యిర్మీ 13:3–7.

[యూఫ్రటీసు ఎడారి దేశానికి వందలకొద్దీ మైళ్ళ దూరంలో వుంది]

## మరీ తెలివి తక్కువ పనులకు కూడ దేవుడిప్రేరణ !

మరియు నరపుత్రుడా, నీవు మంగలకత్తివంటి వాడిగల కత్తియొకటి తీసి కొని నీ తలను, గడ్డమును క్షౌరము చేసికొని, త్రాసు తీసికొని ఆ వెండ్రుకలనుతూచి భాగములు చేయుము. పట్టణము ముట్టడి వేసిన దినములు సంపూర్ణమైనప్పుడు నీవు పట్టణములో వాటి మూడవ భాగమును కాల్చి, రెండవ భాగమును తీసి ఖడ్గముచేత హతముచేయు రీతిగా దానిని చుట్టు విసిరికొట్టి మిగిలిన భాగము గాలికి ఎగిరిపోనిమ్ము. నేను ఖడ్గము దూసి వాటిని తరుముదును. అయితే వాటిలో కొన్నిటిని తీసికొని నీచెంగున కట్టుకొనుము. యెహె 5:1-3.

## పూనకం మహత్యం

ప్రభువైన యెహోవా హస్తము నా మీదికి వచ్చెను. అంత నేను చూడగా అగ్నిని పోలిన ఆకారము నాకు కనబడెను ...మరియు జెఱ్ఱు వంటిది ఒకటి

ఆయన చాపి నాతల వెండ్రుకలు పట్టుకొనగా ఆత్మ భూమ్యాకాశముల మధ్యకు నన్నెత్తి....యెరూషలేము....ఆవరణ ద్వారము దగ్గర....నన్ను దించెను.

యెహె 8:1-3.

ఆయన నాకాజ్ఞాపించినట్లు నేను చేసితిని, ఎట్లనగా నేను దేశాంతరము పోవు వాడనైనట్టుగా పగటియందు నా సామగ్రిని బయటికి తెచ్చి అస్తమయమున నా చేతితో గోడకు కన్నముచేసి వారు చూచుచుండగా సామగ్రిని తీసికొని మూట భుజము మీద పెట్టుకొంటిని. యెహె 12:7.

## ఎండిన ఎముకలు ప్రాణంతో లేచి తిరుగాడాయి !

యెహోవా హస్తము నా మీదికి వచ్చెను; నేను ఆత్మవశుడనై యుండగా యెహోవా నన్ను తోడుకొని పోయి ఎముకలతో నిండియున్న యొక లోయలో నన్ను దింపెను....అందుకాయన ప్రవచనమెత్తి యెండిపోయిన ఈ యెముకలతో ఇట్లనుము — ఎండిపోయిన యెముకలారా, యెహోవా మాట ఆలకించుడి....నేను ప్రవచించు చుండగా గడగడమను ధ్వనియొకటి పుట్టెను; అప్పుడు ఎముకలు ఒకదానితో ఒకటి కలిసికొనెను....జీవాత్మ వారిలోనికి వచ్చెను; వారు సజీవులై లేచి లెక్కింప శక్యముకాని మహాసైన్యమైనిలిచిరి. యెహె 37:1-10.

[ఇది భ్రమలాగ చెప్పబడింది, కాని పరిశుద్ధ గ్రంథములో దాన్ని వాస్తవిక సంఘటన గానే చెప్పబడింది.]

## నాలుగు తలల పక్షి

యెహోవా వాక్కు యాజకుడనగు యెహెజ్కేలునకు ప్రత్యక్షముకాగా.... నేను చూడగా....నాలుగు జీవుల రూపములు గల మానవ స్వరూపమువంటిది కనబడెను. ఒక్కొక్కదానికి నాలుగు ముఖములును నాలుగు రెక్కలును గలవు, వాటి కాళ్ళు చక్కగా నిలువబడినవి. వాటి అరకాళ్ళు పెయ్యకాళ్ళవలె ఉండెను. అవి తళ తళలాడు ఇత్తడివలె ఉండెను. వాటి నాలుగు ప్రక్కల రెక్కల క్రింద మానవ హస్తములవంటి హస్తములుండెను....ఆ నాలుగింటి యెదుటి ముఖ రూపములు మానవముఖము వంటివి, కుడి పార్శ్వపురూపములు సింహముఖము వంటివి, యెడమ పార్శ్వపు ముఖములు ఎద్దు ముఖము వంటివి. నాలుగింటికి పక్షిరాజు ముఖము వంటి ముఖములు కలవు. యెహె 1:3-10.

## పెంకు మీదదాడి చేసిన యెహెజ్కేలు !

నరపుత్రుడా పెంకు ఒకటి తీసికొని వచ్చి నీముందర ఉంచుకొని యెరూష లేము పట్టణపు రూపమును దాని మీద వ్రాయుము. మరియు అది ముట్టడి వేయబడి నట్లును దాని యెదుట బురుజులను కట్టినట్లును దిబ్బవేసి నట్లును దాని చుట్టునున్న ప్రాకారమును కూలగొట్టు యంత్రములున్నట్లును నీవు వ్రాయుము....మరియు నీ యెడమ ప్రక్కను పండుకొనియుండి ఇశ్రాయేలువారి దోషమును దాని మీద మోపవలెను....ఇశ్రాయేలు వారి దోషమును నీవు భరించు నట్లు....దినములు నిర్ణయించి యున్నాను. ఆ దినములు గడిచిన తరువాత కుడి ప్రక్కను పండుకొనియుండి నలువది దినములు యూదావారి దోషమును భరింప వలెను....పట్టణము ముట్టడివేయబడి నట్లుండు దినములు నీవు రెండవ ప్రక్కను తిరుగక అదేపాటున ఉందువు. యెహె 4:1-8.

## మరచిపోయిన కలను గుర్తుచేసి వివరించే మేధావి !

రాజు-నేనుదాని మరచి పోతినిగాని, కలను దాని భావమును మీరు తెలియ జేయని యెడల మీరు తుత్తునియలుగా చేయబడుదురు; మీయిండ్లు పెంటకుప్పగా చేయబడును....ఇట్టి శాసనము బయలుదేరుట వలన జ్ఞానులు చంపబడవలసి యుండగా, వారు దానియేలును అతని స్నేహితులను చంపజూచిరి....తాము పడక మీద పరుండగా తమరి మనస్సులో కలిగిన స్వప్న దర్శనములు ఏవనగా....రాజా, తాము చూచుచుండగా బ్రహ్మాండమైన ప్రతిమకనబడెను గదా....ఆ ప్రతిమ యొక్క శిరస్సు మేలిమిబంగారుమయమైనదియు, దాని రొమ్మును భుజములును వెండివియు, దాని ఉదరమును తొడలును ఇత్తడివియు, దాని మోకాళ్ళు ఇనుపవియు దాని పాదము లలో ఒక భాగము ఇనుపదియు ఒక భాగము మట్టిదియునై యుండెను....అంతట రాజగు నెబుకద్నెజరు దానియేలునకు సాష్టాంగనమస్కారము చేసెను.

దాని 2:5,13,28,38,46.

## కొలతల్లో అవకతవకలు !

రాజగు నెబుకద్నెజరు బంగారు ప్రతిమ యొకటి చేయించి, బబులోను దేశ ములోని దూరాయను మైదానమందు దాని నిలువ బెట్టించెను. అది అరువది మూరల యెత్తును ఆరుమూరల వెడల్పు గలదైయుండెను. దాని 3:1.

(వెడల్పుకు పదిరెట్లు ఎత్తుగా నిర్మించారట. అంటే ఒక అడుగు వెడల్పుకు పది అడుగుల ఎత్తన్నమాట !)

## నిప్పుల్లో వేస్తే వెంట్రుకకూడ కాలలేదు

సాగిలపడి నమస్కరింపని వాడెవడో వాడు మండుచున్న అగ్ని గుండములో తక్షణమే వేయబడును....అందుకు నెబుకద్నెజరు అత్యాగ్రహము నొందినందున షద్రకు, మేషాకు, అబేద్నెగోయను వారి విషయములో ఆయన ముఖము వికారమాయెను గనుక గుండము ఎప్పటికన్న ఏడంతలు వేడిమిగా చేయుమని ఆజ్ఞఇచ్చెను-మరియుతన సైన్యములో నుండు బలిష్ఠులలో కొందరిని పిలువనంపించి-షద్రకును, మేషాకును, అబేద్నెగోను బంధించి వేడిమిగలిగిమండుచున్న ఆ గుండములో వేయుడని ఆజ్ఞఇయ్యగా వారు వారి అంగీలను నిలువుటంగీలను పై వస్త్రములను తక్కిన వస్త్రములను తియ్యకయే, యున్నపాటున ముగ్గురిని వేడిమిగలిగి మండుచున్న ఆ గుండము నడుమ పడవేసిరి, రాజాజ్ఞ తీవ్రమైనందునను గుండము మిక్కిలి వేడిమిగలదైనందునను షద్రకు. మేషాకు, అబేద్నగోలను విసిరి వేసిన ఆ మనుష్యులు అగ్నిజ్వాలలచేత కాల్చబడి చనిపోయిరి...రాజగు నెబుకద్నెజరు ఆశ్చర్యపడి తీవరముగ లేచి-మేము ముగ్గురు మనుష్యులను బంధించి యీ అగ్నిలో వేసితిమిగదా యని తన మంత్రుల నడిగెను. వారు-రాజా, సత్యమే అని రాజుతో ప్రత్యుత్తరమిచ్చిరి. అందుకు రాజు నేను నలుగురు మనుష్యులు బంధకములు లేక అగ్నిలో సంచరించుట చూచుచున్నాను. వారికి హాని ఏమియు కలుగలేదు; నాలుగవవాని రూపము దేవతల రూపమును పోలినదని వారికి ప్రత్యుత్తరమిచ్చెను ...అంతట షద్రకు, మేషాకు, అబేద్నగో ఆ అగ్నిలో నుండి బయటకి వచ్చిరి. అధిపతులును సేనాధిపతులును సంస్థానాధిపతులును రాజుయొక్క ప్రధానమంత్రులును కూడివచ్చి ఆ మనుష్యులను పరీక్షించి వారి శరీరములకు అగ్ని యేహాని చేయకుండుటయు, వారి తల వెంట్రుకలలో ఒకటైనను కాలిపోకుండుటయు, వారి వస్త్రములు చెడిపోకుండుటయు, అగ్నివాసనయైనను వారి దేహములకు తగలకుండుటయుచూచిరి.

దాని 3:6,19-27.

## మనిషిలేని చెయ్యి !

ఆ గడియలోనే మానవహస్తపు వ్రేళ్లు కనబడి, దీపముదగ్గర రాజుయొక్క నగరుగోడ పూతమీద ఏదోయొక వ్రాత వ్రాయుచున్నట్టుండెను. రాజు ఆ హస్తము వ్రాయుట చూచెను. దాని 5:5

## సింహాల నోళ్ళు మూయించిన దైవదూత

అంతట రాజు ఆజ్ఞ ఇయ్యగా బంట్రోతులు దానియేలును పట్టుకొని పోయి సింహముల గుహలో పడద్రోసిరి....అందుకు దానియేలు-రాజు చిరకాలము జీవించును గాక. నేను నా దేవుని దృష్టికి నిర్దోషినిగా కనబడితిని గనుక ఆయన తన దూత నంపించి, సింహములు నాకు ఏ హానియుచేయకుండ వాటినోళ్ళు మూయించెను .... రాజు దానియేలును గుహలోనుండి పైకి తీయుడని ఆజ్ఞ ఇయ్యగా బంట్రోతులు దానియేలును బయటికి తీసిరి. అతడు తన దేవునియందు భక్తికలవాడైనందున అతనికి ఏ హానియు కలుగలేదు. దాని 6:16-23.

## ఆమోసుకు ఇంటర్వ్యూ ఇచ్చిన దేవుడు

యెహోవా బలిపీఠమునకు పైగా నిలిచియుండుట నేను చూచితిని. అప్పుడు ఆయన నా కాజ్ఞయిచ్చిన దేమనగా-గడపలు కదలిపోవునట్లుగా పై కమ్ములను కొట్టి వారందరి తలలమీద వాటిని పడవేసి వగులగొట్టుము; తరువాత వారిలో ఒకడును తప్పించుకొనకుండను, తప్పించుకొనువారిలో ఎవడును బ్రదుకకుండను నేను వారి నందరిని ఖడ్గముచేత వధింతును, వారు పాతాళములో చొచ్చిపోయినను అచ్చటనుండి నా హస్తము వారిని బయటికిలాగును; ఆకాశమున కెక్కిపోయినను అచ్చటనుండి వారిని దింపి తెచ్చెదను....నా కన్నులకు కనబడకుండ వారు సముద్రములో మునిగినను అచ్చటి సర్పమునకు నే నాజ్ఞఇత్తును, అది వారిని కరచును.

ఆమో 9:1-3.

## దేవుడు సర్వమయుడు కాడేమోనని బైబిలుకే అనుమానం!

అయితే యెహోవా సన్నిధిలోనుండి తర్షీషు పట్టణమునకు పారి పోవలెనని యోనా యొప్పేకు పోయి తర్షీషునకు పోవు ఒక ఓడను చూచి, ప్రయాణమునకు కేవు ఇచ్చి, యెహోవా సన్నిధిలో నిలువక ఓడ వారితో కూడ తర్షీషునకు పోవుటకు ఓడ ఎక్కెను. యోనా 1 : 3.

## నేరస్థుడిని నీటిలోపడేస్తే తుఫాను శాంతించిందట!

అయితే యెహోవా సముద్రము మీద పెద్దగాలి పుట్టింపగా సముద్రమందు గొప్ప తుఫానురేగి ఓడ బద్దలై పోవు గతివచ్చెను .... అంతలో ఓడవారు - ఎవనిని

బట్టి ఇంత కీడు మనకు సంభవించినది తెలియుటకై మనము చీట్లువేతము రండని యొకరితో ఒకరు చెప్పుకొని, చీట్లువేయగా చీటి యోనామీదికి వచ్చెను .... నన్ను బట్టియే యీ గొప్పతుఫాను మీ మీదికి వచ్చెనని నాకు తెలిసియున్నది, నన్ను ఎత్తి సముద్రములో పడవేయుడి, అప్పుడు సముద్రము మీ మీదికి రాకుండ నిమ్మళించునని అతడు వారితో చెప్పెను .. యోనాను ఎత్తి సముద్రములో పడవేసిరి; పడవేయగానే సముద్రము పొంగకుండ ఆగెను. యోనా 1;4,7,12,15.

## తిమింగలం కడుపులో యోనా!

గొప్ప మత్స్యము ఒకటి యోనాను మ్రింగవలెనని యెహోవా నియమించి యుండగా యోనా మూడు దినములు ఆ మత్స్యముయొక్క కడుపులో నుండెను.

యోనా 1 ; 17.

## తిమింగలం కథ ధృవపర్చిన యేసుక్రీస్తు!

యోనా మూడు రాత్రింబగళ్ళు తిమింగలము కడుపులో ఏలాగుండెనో ఆలాగు మనుష్య కుమారుడు రాత్రింబగళ్ళు భూగర్భములో ఉండును.

మత్త 12 : 40.

[మత్స్యము అంటే తిమింగలం కాదు. పాత నిబంధనలోని "గొప్పమత్స్యము క్రొత్త నిబంధనలో కొచ్చేసరికి "తిమింగలం" అయికూర్చుంది]

## తిమింగలం కడుపులో ప్రార్థనా సమావేశం!

ఆ మత్స్యము కడుపులోనుండి యోనా యెహోవాను ఈలాగున ప్రార్థించెను ....ప్రాణాంతము వచ్చునంతగా జలములు నన్ను చుట్టుకొని యున్నవి, సముద్రాగాధము నన్ను ఆవరించియున్నది; సముద్రపు నాచు నా తలకు చుట్టుకొని యున్నది. నేను మరెన్నటికిని ఎక్కిరాకుండ భూమి గడియలు వేయబడియున్నవి; పర్వతముల పునాదులలోనికి నేను దిగియున్నాను. యోనా 2:1-6.

## యోనాను కక్కిన తిమింగలం!

అంతలో యెహోవా మత్స్యమునకు ఆజ్ఞ ఇయ్యగా అది యోనాను నేల మీద కక్కివేసెను. యోనా 2;10.

## ఒక్కరాత్రిలో పెరిగి మరోరాత్రిలో చనిపోయిన సొరచెట్టు!

దేవుడైన యెహోవా సొరచెట్టొకటి ఏర్పరచి అతనికి కలిగిన శ్రమ పోగొట్టుటకై అది పెరిగి యోనా తలకు పైగా నీడ యిచ్చునట్లు చేసెను .... మరునటి ఉదయమందు దేవుడు ఒక పురుగును ఏర్పరచగా అది ఆ చెట్టును తొలిచినందున వాడి పోయెను... ఒక రాత్రితోనేపుట్టి పెరిగి ఒక రాత్రిలోగానే వాడిపోయెను.

యోనా 4:6–10.

## హబక్కూకు దేవుడు

దేవుడు తేమానులో నుండి బయలుదేరుచున్నాడు. పరిశుద్ధదేవుడు పారానులో నుండి వేంచేయుచున్నాడు .... ఆయన పాదముల వెంట అగ్ని మెరుపులు వచ్చుచున్నవి. ఆయన నిలువబడగా భూమి కంపించును. హబ 3:3–6.

## దేవుణ్ణిగూర్చి అర్థం పర్థం లేని వర్ణనలు!

ఆయన నాసికారంధ్రములలో నుండి పొగపుట్టెను. ఆయన నోటినుండి అగ్ని వచ్చి దహించెను. నిప్పుకణములను రాజబెట్టెను. మేఘములను వంచి ఆయన వచ్చెను.... కెరూబుమీద ఎక్కి ఆయనవచ్చెను. గాలి రెక్కలమీద ప్రత్యక్షమాయెను,

2 సమూ 22.9–11,

అది నీ దేవుడైన యెహోవా లక్ష్యపెట్టు దేశము. నీ దేవుడైన యెహోవా కన్నులు సంవత్సరాది మొదలుకొని సంవత్సరాంతము వరకు ఎల్లప్పుడు దానిమీద ఉండును. ద్వితీ 11 : 12.

యెహోవా యుద్ధశూరుడు. నిర 15 : 3.

యెహోవా కనుదృష్టి లోకమందంతట సంచారము చేయుచున్నది.

2 దిన 16:9; జెక 4:10.

## జెకర్యా స్వప్నదర్శనం

మొదటి రథమునకు ఎఱ్ఱని గుఱ్ఱములు, రెండవ రథమునకు నల్లని గుఱ్ఱములు, మూడవ రథమునకు తెల్లని గుఱ్ఱములు, నాలుగవ రథమునకు చుక్కలు చుక్కలుగల బలమైన గుఱ్ఱములుండెను. నా యేలినవాడా, యివేమిటియని నాతో

మాటలాడుచున్న దూతను నేనడుగగా అతడు నాతో ఇట్లనెను — ఇవి సర్వలోకనాథు డగు యెహోవా సన్నిధిని విడిచి బయలువెళ్ళు ఆకాశపు చతుర్వాయువులు.

జెక 6:2_5.

## దైవదూత మాటలు నమ్మనందుకు జెకర్యా మూగవాడయ్యాడు

ఎలీసబెతు గొడ్రాలైనందున వారికి పిల్లలు లేకపోయిరి; మరియు వారిద్దరు బహుకాలము గడిచిన వృద్ధులైరి....ప్రభువు దూత అతనితో—జెకర్యా భయపడకుము; నీ ప్రార్థన వినబడినది. నీ భార్యయైన ఎలీసబెతు నీకు కుమారుని కనును, అతనికి యోహాను అనుపేరు పెట్టుదువు .... మరియు నా మాటలు వాటి కాలమందు నెర వేరును; నీవు వాటిని నమ్మలేదు గనుక ఈ సంగతులు జరుగుదినము వరకు నీవు మాటలాడక మౌనివైయుందువని అతనితో చెప్పెను లూకా 1:7,13,20.

## గర్భంలో ఉండగానే పవిత్రాత్మ ఆవేశించిన శిశువు!

అతడు తన తల్లిగర్భమున పుట్టినది మొదలుకొని పరిశుద్ధాత్మతో నిండుకొనిన వాడైయుండును. లూకా 1 : 15.

## యోసేపు తండ్రులిద్దరా ?

యాకోబు మరియు భర్తయైన యోసేపును కనెను. మత్త 1:16.

యోసేపు హేలీకి కుమారుడు. లూకా 3:23.

## ఆత్మలవల్ల కూడ మానవులకు సంతానం కలుగుతుందా ?

యేసుక్రీస్తు జననవిధమెట్లనగా, ఆయన తల్లియైన మరియ యోసేపునకు ప్రదానము చేయబడిన తరువాత వారేకముకాక మునుపు ఆమె పరిశుద్ధాత్మవలన గర్భవతిగావుండెను మత్త 1 : 18.

## యోసేపు స్వప్న సమాధానం

అతడు ఈ సంగతులను గూర్చి ఆలోచించుకొనుచుండగా, ఇదిగో ప్రభువు దూత స్వప్నమందు అతనికి ప్రత్యక్షమై—దావీదు కుమారుడవైన యోసేపూ, నీభార్య

యైన మరియను చేర్చుకొనుటకు భయపడకుము. ఆమె గర్భము ధరించినది పరిశుద్ధాత్మవలన కలిగినది. మత్త 1:20.

## తల్లియైన కన్య !

ఇదిగో కన్యక గర్భవతియై కుమారుని కనును....అని ప్రభువు తన ప్రవక్త ద్వారా పలికిన మాట నెరవేరు నట్లు ఇదంతయు జరిగెను. మత్త 1:22,23.

## అవతార పురుషుడి పాట్లు !

తన తొలిచూలు కుమారుని కని, పొత్తి గుడ్డలతో చుట్టి, సత్రములో వారికి స్థలములేనందున ఆయనను పశువుల తొట్టిలో పరుండబెట్టెను. లూకా 2 : 7.

ఆయన సశరీరుడుగా ప్రత్యక్షుడయ్యెను. 1 తిమో 3:16.

ఆదియందు వాక్యముండెను, వాక్యము దేవునియొద్ద ఉండెను, వాక్యము దేవుడై యుండెను ...ఆ వాక్యము శరీరధారియై కృపాసత్యసంపూర్ణుడుగా మన మధ్య నివసించెను. యోహా 1:1,14.

అయితే కాలము పరిపూర్ణమైనప్పుడు దేవుడు తన కుమారుని పంపెను. ఆయన స్త్రీయందు పుట్టెను గలతీ 4:4. (ఫిలి 2:6 కూడ చూడండి).

[యేసుక్రీస్తు సర్వోత్కృష్టమైన దేవుడే కాక నిస్సహాయుడైన శిశువు. ఆయన ఏక కాలంలో శక్తిమంతుడు-బలహీనుడు, హద్దులులేనివాడు - హద్దులకులోబడివుండేవాడు, సంపూర్ణజ్ఞానం కలవాడు-జ్ఞానంలేనివాడు, సర్వవ్యాపితుడు-సర్వవ్యాపితుడుకానివాడు అయివున్నాడు]

## ముగ్గురువ్యక్తులూ ఒక్కడే !

సాక్ష్యమిచ్చువారు ముగ్గురు, అనగా ఆత్మయు, నీళ్ళును, రక్తమును, ఈ ముగ్గురు ఏకీభవించియున్నారు, 1 యోహా 5:7.

(అసత్యాన్ని సత్యంగా రుజువుచేయడానికి ప్రయత్నించి చివరకు కొన్ని అనువాదాల్లో దీన్ని తొలగించడం ప్రారంభించారు. బైబిలు కాలంలో లేకపోయినా ఆ తరువాత కొందరు క్రైస్తవులు లేవనెత్తి ప్రచారం చేస్తున్న త్రిత్వసిద్ధాంతాన్ని బలపరచడానికి ఈ వాక్యం ప్రత్యేకంగా వారికి ఉపయోగిస్తున్నది)

## ఆశ్చర్యకరమైన నక్షత్రం

తూర్పుదేశపు జ్ఞానులు యెరూషలేమునకు వచ్చి-యూదుల రాజుగా పుట్టిన వాడెక్కడనున్నాడు ? తూర్పుదిక్కున మేము ఆయన నక్షత్రముచూచి, ఆయనను పూజింపవచ్చితిమని చెప్పిరి ...ఇదిగో తూర్పు దేశమునవారు చూచిన ఆ శిశువు ఉండిన చోటికి మీదుగావచ్చి నిలుచువరకు వారికి ముందుగా నడిచెను.

మత్తై 2 : 1, 2, 9.

(ఒక ఇంటినిగాని ఒక మనిషినిగాని కనుగొనడానికి ఏ నక్షత్రమైనా మీకు సహాయ పడుతుందేమో ప్రయత్నించి చూడండి !)

## తప్పుడు విషయాన్ని చెప్పిన దైవదూత

ఆ దేశంలో కొందరు గొఱ్ఱెలకాపరులు పొలములోవుండి రాత్రివేళ తమ మందను కాచుకొనుచుండగా ప్రభువు దూతవారి యొద్దకువచ్చి నిలిచెను; ప్రభువు మహిమ వారిచుట్టు ప్రకాశించినందున, వారు మిక్కిలి భయపడిరి. అయితే ఆ దూత భయపడకుడి, ఇదిగో ప్రజలందరికిని కలుగబోవు మహా సంతోషకరమైన సువర్త మానము నేను మీకు తెలియజేయుచున్నాను; దావీదు పట్టణమందు నేడు రక్షకుడు మీకొరకు పుట్టియున్నాడు. ఈయన ప్రభువైన క్రీస్తు. లూకా 2:8_11.

(లోక రక్షకుడు పుట్టాడన్న విషయాన్ని దేవుడు ఊరుపేరూలేని గొఱ్ఱెలకాపరులకి, అనుమానాస్పదంగాతోచే "తూర్పుదేశపుజ్ఞానుల"కు తెలియజేశాడు గాని నిజమైన విజ్ఞానవేత్తలకు, చారిత్రక సత్యాలను నమ్మదగిన రీతిలో గ్రంథస్థంచేసి గతాన్నంతటినీ ఋజువులతో సహా మనకందించిన ఆనాటి చరిత్రకారులకు ఈ విషయం చెప్పలేదు !)

## కళంకంలేని కన్య పరిశుద్ధ పరచబడిందట !

మోషే ధర్మశాస్త్రము చొప్పున వారు తమ్మును శుద్ధి చేసికొను దినములు గడిచినప్పుడు .... ప్రభువు ధర్మశాస్త్రమందు వ్రాయబడినట్టు ఆయనను ప్రభువుకు ప్రతిష్టించుటకును. ప్రభువు ధర్మశాస్త్రమందు చెప్పబడినట్టు గువ్వల జతనైనను రెండు పావురపు పిల్లలనైనను బలిగా సమర్పించుటకును, వారు ఆయనను యెరూష లేమునకు తీసికొనిపోయిరి. లూకా 2:22_24.

## ఒక్కటిగా బహిరంగపర్చబడ్డ ముగ్గురు

యేసు బాప్తిస్మము పొందిన వెంటనే నీళ్ళలోనుండి ఒడ్డునకు వచ్చెను; ఇదిగో ఆకాశము తెరువబడెను, దేవుని ఆత్మ పావురమువలె దిగి తనమీదికి వచ్చుట చూచెను. మరియు–ఇదిగో ఈయనే నా ప్రియకుమారుడు, ఈయనయందు నేనా నందించుచున్నానని యొక శబ్దము ఆకాశమునుండి వచ్చెను. మత్తయి 3 : 16, 17.

పరిశుద్ధాత్మ శరీరాకారముతో పావురమువలె ఆయన మీదికి దిగివచ్చెను అప్పుడు నీవు నా ప్రియకుమారుడవు, నీ యందు నేనానందించుచున్నానని యొక శబ్దము ఆకాశమునుండి వచ్చెను, లూకా 3:22.

(దేవుడిని నీళ్ళలో ముంచారు; ఆయన ఆకాశమునుండి పావురమువలె తన మీదికి దిగాడు అదే సమయంలో ఆయన తన కుమారుడిని అంగీకారము తెలుపుతూ ఆకాశము నుండి ప్రకటన చేశాడు! గత కార్యాలకు పశ్చాత్తాపం వ్యక్తంచేస్తూ తిరిగి సంపూర్ణమైన పరిశుద్ధ జన్మ నెత్తడానికి యేసు (దేవుడు) కూడ బాప్తిస్మము పొందాడు. వివేకవంతుడైన యోహాను దేవుని ప్రతిరూపమైన యేసుకు బాప్తిస్మమిచ్చాడు కాని బాప్తిస్మము పొందలేదు!]

## దేవుడు దేవుడితో నిండియున్నాడు!

యేసు పరిశుద్ధాత్మ పూర్ణుడై యుండెను. లూకా 4 : 1.
(అయితే పరిశుద్ధాత్మ యేసుతో నిండియున్నదా?)

## సాతానుచే శోధించబడిన యేసు

అప్పుడు యేసు అపవాది (సాతాను) చేత శోధింపబడుటకు ఆత్మవలన అరణ్యమునకు కొనిపోబడెను. మత్తయి 4:1.

వెంటనే పరిశుద్ధాత్మ ఆయనను అరణ్యములోనికి త్రోసికొనిపోయెను ఆయన సాతానుచేత శోధింపబడుచు అరణ్యములో నలువది దినములు అడవి మృగములతో కూడ నుండెను. మార్కు 1 : 12, 13.

## అర్థంలేని శోధన!

ఆ శోధకుడు ఆయన యొద్దకువచ్చి–నీవు దేవుని కుమారుడవైతే ఈ రాళ్ళ

రొట్టెలగునట్లు ఆజ్ఞాపించుమనెను-అందుకాయన-మనుష్యుడు రొట్టెవలన మాత్రము కాదుగాని దేవుని నోటనుండి వచ్చు ప్రతి మాటవలనను జీవించును అని వ్రాయబడి యున్నదనెను. మ త్త 4 : 3, 4.

## కొండమీదికెక్కితే భూగోళమంతా కనిపిస్తుందా ?

మరల అపవాది మిగుల ఎత్తయిన యొక కొండ మీదికి ఆయనను తోడు కొనిపోయి, ఈ లోకరాజ్యములన్నిటిని, వాటి మహిమను ఆయనకు చూపి నీవు సాగిల పడినాకు నమస్కారము చేసిన యెడల వీటినన్నిటిని నీకిచ్చెదనని ఆయనతో చెప్పెను. మ త్త 4:8, 9.

("భూమియు దాని సంపూర్ణతయు లోకమును దాని నివాసులును యెహోవావే" అని కీర్త 24:1,2 చెబుతున్నది. అంటే సాతాను అప్పటికే యేసువి అయివున్నవాటిని యేసుకు ఇస్తానన్నాడా ?)

## నీటిని మద్యంగా మార్చడం

రెండేసి మూడేసి తూములు పట్టు ఆరు రాతి బానలు అక్కడ ఉంచబడి యుండెను. యేసు ఆ బానలు నీళ్లతో నింపుడని వారితో చెప్పగా వారు వాటిని అంచులమట్టుకు నింపిరి. అప్పుడాయన వారితో-మీరిప్పుడు ముంచి విందు ప్రధాని యొద్దకు తీసికొని పొండని చెప్పగా, వారు తీసికొనిపోయిరి....ద్రాక్షారసమైన ఆ నీళ్లు రుచిచూచిరి....గలిలయలోని కానాలో, యేసు ఈ మొదటి సూచక క్రియను చేసి తన మహిమను బయిలు పరచెను; అందువలన ఆయన శిష్యులు ఆయన యందు విశ్వాసముంచిరి. యోహా 2:6-11.

(ఇంత చిన్నగారడీపని దైవత్వానికి చిహ్నంగా చూపడంలో అర్థంలేదు.)

## భూత వైద్యుడిగా యేసు

ఆ సమయమున వారిసమాజ మందిరములో అపవిత్రాత్మ పట్టిన మనుష్యు డొకడుండెను. వాడు-నజరేయుడవగు యేసూ, మాతో నీకేమి, మమ్ము నశింప జేయుటకు వచ్చితివా? నీవెవడవో నాకు తెలియును; నీవు దేవుని పరిశుద్ధుడవు అని కేకలు వేసెను. అందుకు యేసు-ఊరకుండుము వానిని విడిచిపొమ్మని దానిని గద్దింపగా అపవిత్రాత్మ వానిని విలవిలలాడించి పెద్దకేక వేసి వాని విడిచిపోయెను. అందరు

విస్మయమొందిరి. మార్కు 1:23,27.

(లూకా 8:28 కూడ చూడండి)

## దెయ్యాలు పట్టుకోవడం

ఆయన నానావిధరోగములచేత పీడింపబడిన అనేకులను స్వస్థపరచి, అనేకమైన దయ్యములను వెళ్లగొట్టెను. అవి తన్ను ఎరిగియుండినందున ఆయన ఆ దయ్యములను మాటలాడనియ్యలేదు. మార్కు 1:34.

ఆయన వారిని చూచి-మీరు వెళ్ళి ఆ నక్కతో ఈలాగుచెప్పుడి-ఇదిగో.... నేను దయ్యములను వెళ్ళగొట్టుదును. లూకా 13:32.

ఏడు దయ్యములు వదలిపోయిన మగ్దలేనే అనబడిన మరియ....ఆయనతో కూడ ఉండెను. లూకా 8:2.

## మనిషినుంచి బయటకు పంపబడ్డ దయ్యం 2,000 పందుల్లో దూరింది

ఆయన దోనె దిగగానే, అపవిత్రాత్మ పట్టిన వాడొకడు సమాధులలో నుండి వచ్చి, ఆయన కెదురుపడెను. వాడు సమాధులలో వాసము చేసెడివాడు, సంకెళ్ళతో నయినను ఎవడును వాని బంధింపలేకపోయెను .... వాడు దూరమునుండి యేసును చూచి, పరుగెత్తికొనివచ్చి, ఆయనకు నమస్కారముచేసి - యేసూ, సర్వోన్నతుడైన దేవుని కుమారుడా, నాతో నీకేమి? నన్ను బాధ పరచకుమని దేవునిపేరిట నీకు ఆన బెట్టుచున్నానని బిగ్గరగా కేకలువేసెను. ఎందుకనగా ఆయన - అపవిత్రాత్మా, ఈ మనుష్యుని విడిచిపొమ్మని వానితోచెప్పెను. మరియు ఆయన - నీపేరేమని వాని నడుగగా వాడు - నా పేరు సేన, యేలయనగా మేము అనేకులమని చెప్పి తమ్మును ఆ దేశములో నుండి తోలివేయవద్దని ఆయనను మిగుల బతిమాలుకొనెను. అక్కడ కొండదగ్గర పందుల పెద్దమంద మేయుచుండెను గనుక - ఆ పందులలో ప్రవేశించునట్లు మమ్మును వాటియొద్దకు పంపుమని, ఆ దెయ్యములు ఆయనను బతిమాలుకొనెను. యేసు వాటికి సెలవియ్యగా ఆ అపవిత్రాత్మలు వానిని విడిచి పందులలో ప్రవేశించెను. ప్రవేశింపగా ఇంచుమించు రెండువేల సంఖ్యగల ఆ మందప్రపాతము నుండి సముద్రపు దారిని వడిగా పరుగెత్తికొనిపోయి, సముద్రములో పడి ఊపిరి

తిరుగక వచ్చెను. మార్కు 5:2-14.

(లూకా 8:26-34; మత్త 8:28-32 కూడ చూడండి)

(దైవ త్రిత్వం ఒకటి కావడం ఆశ్చర్యమనుకుంటె ఒకదయ్యం 2 వేల దయ్యాలుగా మారడం ఇంకా విచిత్రంగా వుంది!)

## శిష్యులు కూడ దయ్యాలను వెళ్లగొట్టారు

ఆయన తన పండ్రెండు మంది శిష్యులను పిలిచి సమస్తమైన దయ్యముల మీద శక్తిని అధికారమును, రోగములు స్వస్థపరచు వరమును వారి కనుగ్రహించెను. లూకా 9 : 1.

ఆ డెబ్బదిమంది శిష్యులు సంతోషముతో తిరిగివచ్చి - ప్రభువా, దయ్యములు కూడ నీ నామమువలన మాకు లోబడుచున్నవని చెప్పెను. లూకా 10:17.

## విశ్వాసులంతా దయ్యాలను వెళ్లగొట్టవచ్చు

నమ్మినవారివలన ఈ సూచకక్రియలు కనబడును. ఏవనగా నా నామమున దయ్యములను వెళ్ళగొట్టుదురు. మార్కు 16:17.

## మూగ, గ్రుడ్డి, మూర్ఛ, పిచ్చి మొదలైన వాటికి కారణం దయ్యాలా ?

యేసును ఆయన శిష్యులును వెళ్ళుచుండగా కొందరు, దయ్యము పట్టినయొక మూగవాని ఆయన యొద్దకు తీసికొనివచ్చిరి. దయ్యము వెళ్ళగొట్టబడిన తరువాత ఆ మూగవాడు మాటలాడెను. మత్త 9:32,33.

అప్పుడు దయ్యము పట్టిన గ్రుడ్డివాడును మూగవాడునైన యొకడు ఆయన యొద్దకు తేబడెను. ఆయన వానిని స్వస్థ పరచినందున ఆ మూగవాడు మాటలాడు శక్తియు చూపును గలవాడాయెను. మత్త 12 : 22.

ఇదిగో ఒక దయ్యము వాని పట్టును, పట్టినప్పుడు వాడు అకస్మాత్తుగా కేకలు వేయును; నురుగు కారునట్లు అది వానిని విలవిల లాడించుచు గాయపరచుచు వానిని వదలి వదలకుండును....వాడు వచ్చుచుండగా ఆ దయ్యము వానిని పడద్రోసి, విలవిల

లాడించెను; యేసు ఆ అపవిత్రాత్మను గద్దించి బాలుని స్వస్థపరచి వాని తండ్రి కప్ప గించెను. లూకా 9:39,42.

ఒకడు ఆయనయొద్దకువచ్చి ఆయన యెదుట మోకాళ్ళూని - ప్రభువా, నా కుమారుని కరుణింపుము; వాడు చాంద్రరోగియై మిక్కిలి బాధపడుచున్నాడు .... అంతట యేసు ఆ దయ్యమును గద్దింపగా అది వానిని వదలిపోయెను.
మత్త 17 : 14, 18.

## ఛాందస దయ్యాలు

దేవుడొక్కడే అని నీవు నమ్ముచున్నావు, ఆలాగు నమ్ముట మంచిదే. దయ్యములును నమ్మివణకు చున్నవి. యాకో 2 : 19.

## వివేకంలేని బోధలు

దుష్టుని ఎదిరింపక, నిన్నుకుడి చెంపమీద కొట్టువాని వైపునకు ఎడమచెంప కూడ త్రిప్పుము. ఎవడైనా నీ మీద వ్యాజ్యమువేసి నీ అంగి తీసికొనగోరిన యెడల వానికి నీపై వస్త్రముకూడ ఇచ్చివేయుము. ఒకడు ఒక మైలుదూరము రమ్మని నిన్ను బలవంతముచేసిన యెడల, వానితో కూడ రెండుమైళ్లు వెళ్ళుము. నిన్ను అడుగువాని కిమ్ము, నిన్ను అప్పు అడుగగోరు వానినుండి నీ ముఖము త్రిప్పుకొనవద్దు.
మత్త 5:39_42.

ఆత్మ విషయమై దీనులైన వారు ధన్యులు. మత్త 5:3.

మీరు తీర్పు తీర్చకుడి, అప్పుడు మిమ్మునుగూర్చి తీర్పు తీర్చబడదు.
మత్త 7 : 1.

(ఈ తెలివి తక్కువ నీతులువల్ల మంచివాళ్ళు పెద్దవాళ్ళ దయాదాక్షిణ్యాలకు ఎదురు చూడాలి. అంటే నాగరిక సమాజం అంతరించినట్లే)

## స్వయంకృత అంగవైకల్యం శీలానికి గుర్తు

నేను మీతో చెప్పునదేమనగా - ఒకస్త్రీని మోహపుచూపుతో చూచు ప్రతివారు అప్పుడే తన హృదయమందు ఆమెతో వ్యభిచారముచేసిన వాడగును. నీ కుడికన్ను నిన్ను అభ్యంతర పరచినయెడల దాని పెరికి నీయొద్దనుండి పారవేయుము, నీదేహ మంతయు నరకములో పడవేయబడకుండునట్లు నీ అవయవములలో నొకటి నశిం

చుట నీకు ప్రయోజనకరముగదా. నీ కుడిచెయ్యి నిన్ను అభ్యంతర పరచినయెడల దానినరికి నీ యొద్దనుండి పారవేయుము; నీ దేహమంతయు నరకములో పడకుండ నీఅవయవములలో ఒకటి నశించుట నీకు ప్రయోజనకరము గదా.

మత్తయి 5 : 28 - 30.

తల్లి గర్భమునుండి నపుంసకులుగా పుట్టినవారు గలరు, మనుష్యులు వలన నపుంసకులుగా చేయబడిన నపుంసకులును గలరు, పరలోకరాజ్యము నిమిత్తము తమ్మునుతామే నపుంసకులనుగా చేసికొనిన నపుంసకులును గలరు. ఈ మాటను అంగీకరింపగలవాడు అంగీకరించునుగాక అని వారితో చెప్పెను. మత్త 19:12.

## ఇహం మరువవలసిన క్రైస్తవ విధి

భూమిమీద మీ కొరకు ధనమును కూర్చుకొనవద్దు....ఏమి తిందుమో యేమి త్రాగుదుమో అని మీ ప్రాణమును గూర్చియైనను, ఏమి ధరించుకొందుమో అని మీ దేహమును గూర్చియైనను చింతింపకుడి....ఆకాశపక్షులను చూడండి; అవి విత్తవు కోయవు కొట్లలో కూర్చుకొనవు; అయినను మీ పరలోకపు తండ్రి వాటిని పోషించు చున్నాడు; మీరు వాటికంటె బహుశ్రేష్టులు కారా?....అడవిపువ్వులు ఏలాగు నెదుగు చున్నవో ఆలోచించుడి. అవి కష్టపడవు, ఒడకవు....నేడుండి రేపు పొయిలో వేయ బడు అడవిగడ్డిని దేవుడీలాగు అలంకరించిన యెడల, అల్పవిశ్వాసులారా, మీకు మరి నిశ్చయముగా వస్త్రములు ధరింపజేయును గదా. కాబట్టి-ఏమితిందుమో యేమి త్రాగుదుమో యేమి ధరించుకొందుమో అని చింతింపకుడి; అన్యజనులు వీటన్ని విషయమై విచారింతురు. ఇవన్నియు మీకు కావలెనని మీ పరలోకపు తండ్రికి తెలి యును. కాబట్టి మీరు ఆయన రాజ్యమును నీతిని మొదట వెదకుడి; అప్పుడవన్నియు మీ కనుగ్రహింపబడును. రేపటిని గూర్చి చింతింపకుడి; రేపటి దినము దాని సంగతులను గూర్చి చింతించును. మత్త 6:19-34.

## ప్రార్థనాశక్తి

అడుగుడి మీకియ్యబడును, వెదకుడి మీకు దొరుకును, తట్టుడి మీకు తీయ బడును. అడుగు ప్రతివాడును పొందును; వెదకువానికి దొరకును, తట్టువానికి తీయ బడును. మత్త 7:7,8.

మీరు ప్రార్థన చేయునప్పుడు వేటిని అడుగుదురో అవి నమ్మిన యెడల మీరు వాటినన్నిటిని పొందుదురు. మత్త 21:22.

## విశ్వాసబలం

మీకు ఆవగింజంత విశ్వాసముండినయెడల ఈ కొండను చూచి ఇక్కడనుండి అక్కడికి పొమ్మనగానే అదిపోవును; మీకు అసాధ్యమైనది ఏదియు నుండదని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను,

మత్త 17:20,21. (యోహా 14:12 కూడ చూడండి.)

## విశ్వాసులు అద్భుతాలు చేయగలరు.

నమ్మినవారి వలన ఈ సూచక క్రియలు కనబడును; ఏవనగా, నా నామమున దయ్యములను వెళ్లగొట్టుదురు; క్రొత్త భాషలు మాటలాడుదురు, పాములను ఎత్తి పట్టుకొందురు, మరణకరమైనదేది త్రాగినను అది వారికి హాని చేయదు, రోగుల మీద చేతులుంచినప్పుడు వారు స్వస్థత నొందుదురు. మార్కు 16:17,18.

## దేవుడు కావలసినవారు అజ్ఞానులు, అవివేకులే !

ప్రభువా, నీవు జ్ఞానులకును, వివేకులకును ఈ సంగతులను మరుగుచేసి పసిబాలురకు బయలుపరచినావని నిన్ను స్తుతించుచున్నాను అవును తండ్రీ, ఈలాగు చేయుట నీ దృష్టికి అనుకూలమాయెను. మత్త 11:25,26.

## హద్దులు మీరిన అంచనా !

స్త్రీలు కనినవారిలో బాప్తిస్మమిచ్చు యోహాను కంటె గొప్పవాడు పుట్టలేదని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను. అయినను పరలోక రాజ్యములో అల్పుడైన వాడు అతని కంటె గొప్పవాడు. మత్త 11:11.

(అంటే హోమరు, సోక్రటీసు మరియు మోషే, చివరకు తనకన్న యోహానే గొప్పవాడని క్రీస్తు గ్యారంటీ ఇస్తున్నాడన్నమాట !)

## విశ్వాస చికిత్స

అతడు పౌలు మాటలాడుటవినెను. పౌలు అతని వైపు తేరిచూచి, స్వస్థత పొందుటకు అతనికి విశ్వాసముండెనని గ్రహించి.నీ పాదములు మోపి సరిగా నిలువు

మని, బిగ్గరగా చెప్పినప్పుడు అతడు గంతులు వేసి నడవసాగెను.

అపొ 14:9,10 (అపొ 3:2,6,8,16; మార్కు 5:34 కూడ చూడండి)

## అద్భుత వస్త్రాలు

పండ్రెండేండ్ల నుండి రక్తస్రావ రోగము కలిగిన యొక స్త్రీ యుండెను. ఆమె అనేక వైద్యులచేత ఎన్నో తిప్పలుపడి.... యేసును గూర్చి విని....జనసమూహములో ఆయన వెనుకకు వచ్చి ఆయన వస్త్రము ముట్టెను. వెంటనే ఆమె రక్తధార కట్టెను....వెంటనే యేసు తనలో నుండి ప్రభావము బయలు వెళ్లెనని తనలో తాను గ్రహించి, జనసమూహము వైపు తిరిగి నా వస్త్రములు ముట్టినదెవరని అడిగెను.

మార్కు 5:25-30.

ఆయన వస్త్రపుచెంగు మాత్రము ముట్టనిమ్మని ఆయనను వేడుకొనుచుండిరి. ఆయనను ముట్టినవారందరు స్వస్థతనొందిరి. మార్కు 6:56.

## చేతిగుడ్డల మహాత్యం

ఆయన శరీరమునకు తగిలిన చేతిగుడ్డలైనను నడికట్లయినను రోగుల యొద్దకు తెచ్చినప్పుడు రోగములు వారిని విడిచెను. దయ్యములుకూడ వదలి పోయెను. అపొ 19:12.

## ఎంతతిన్నా తరగని రొట్టెలు, చేపలు

పచ్చికమీద కూర్చుండుడని జనుల కాజ్ఞాపించి, ఆ అయిదు రొట్టెలను రెండు చేపలను పట్టుకొని ఆకాశమువైపు కన్నులెత్తి ఆశీర్వదించి ఆ రొట్టెలు విరిచి శిష్యుల కిచ్చెను, శిష్యులు జనులకు వడ్డించిరి. వారందరు తిని తృప్తిపొందిన తరువాత మిగిలిన ముక్కలు పండ్రెండు గంపల నిండ ఎత్తిరి. స్త్రీలును గాక తినినవారు ఇంచుమించు అయిదువేలమంది పురుషులు. మత్త 14:19-21.

## యేసు నీటి మీదనడిచాడు

అప్పటి కా దోనెదరికి దూరముగ నుండగా గాలి యెదురైనందున అలల వలన కొట్టబడుచుండెను. రాత్రి నాలుగవజామున ఆయన సముద్రము మీద నడుచుచువారి యొద్దకు వచ్చెను. మత్త 14:24,25.

## పేతురుకూడ నీటిపై నడిచాడు

ఆయన రమ్మనగానే పేతురు దోనెదిగి యేసునొద్దకు వెళ్లుటకు నీళ్ళ మీద నడచెను. గాని గాలిని చూచి భయపడి మునిగిపోసాగి-ప్రభువా నన్ను రక్షింపుమని కేకలు వేసెను. మత్త 14:29,30.

## యేసు కోపించగా ఆగిపోయిన తుఫాను

అంతట సముద్రము మీద తుఫాను లేచినందున ఆ దోనె అలలచేత కప్పబడెను. అప్పుడాయన నిద్రించుచుండగా వారు ఆయన యొద్దకు వచ్చి....ఆయనను లేపిరి. ఆయనలేచి గాలిని సముద్రమును గద్దింపగా మిక్కిలి నిమ్మళమాయెను. మత్త 8:24-26.

## చచ్చినవాడు బ్రతికి వచ్చాడు !

ఆయన ఆలాగు చెప్పి లాజరూ, బయటికి రమ్మని బిగ్గరగా చెప్పగా చనిపోయినవాడు, కాళ్ళుచేతులు ప్రేతవస్త్రములతో కట్టబడినవాడై వెలుపలికివచ్చెను. యోహా 11:43,44.

## చేపనోట్లో డబ్బు

నీవు సముద్రమునకు పోయి, గాలమువేసి, మొదట పైకి వచ్చు చేపను పట్టుకొని, దాని నోరు తెరచిన యెడల ఒక షెకెలు దొరకును; దానిని తీసికొని నా కొరకును నీ కొరకును వారికిమ్మని ఆతనితో చెప్పెను. మత్త 17 : 17.

## దేవుడి శాపంతో ఎండిన అంజూరపు చెట్టు

ఆయన (యేసు) ఆకలిగొని ఆకులుగల ఒక అంజూరపు చెట్టును దూరము నుండి చూచి, దాని మీద ఏమైనను దొరకునేమో అని వచ్చెను, దాని యొద్దకువచ్చి చూడగా, ఆకులుతప్ప మరేమియు కనబడలేదు; ఏలయనగా అది అంజూరపు పండ్ల కాలముకాదు. అందుకాయన - ఇకమీదట ఎన్నటికిని నీ పండ్లు ఎవరును తినకుందురు గాక అని చెప్పెను....ప్రొద్దున వారు మార్గమున పోవుచుండగా ఆ అంజూరపు చెట్టు వేళ్ళు మొదలుకొని యెండియుండుట చూచిరి. అప్పుడు పేతురు ఆ సంగతి జ్ఞాప

కమునకు తెచ్చుకొని – బోధకుడా, ఇదిగో నీవు శపించిన అంజూరపు చెట్టు ఎండి పోయెనని ఆయనతో చెప్పెను. మార్కు 11:12-21.

(ఇందులో చెప్పబడ్డ దేవుడి అద్భుతాలు అతడి సర్వాధిక్యతను, శక్తిని కాకుండా బైబిలు రచయితల తెలివి తక్కువతనాన్ని ఏ విషయాన్నైనా ప్రశ్నించకుండా అమోదించే మనస్తత్వాన్ని మాత్రమే తెలియజేస్తాయి. అలాకాకుండా యేసు ఏ ముద్రణా యంత్రాన్నో, స్టీమ్ఇంజన్నో లేదా శాశ్వతంగా ప్రపంచానికంతటికీ ఉపయోగించే ఏ విషయాన్నయినా కనుగొనో తన దయాళుత్వాన్ని చాటుకోవడమే గాక ప్రజల్లో కలకాలం నిలిచి పోయేపని ఎందుకు చెయ్యలేదు?)

## అర్థంకాని బోధలు!

అందుకాయన-దేవుని రాజ్యమర్మము మీకు అనుగ్రహింపబడి యున్నది గాని వెలుపలనుండు వారు ఒకవేళ దేవునివైపు తిరిగి పాపక్షమాపణ పొందుదురని, వారు చూచుటకైతే చూచియు కనుగొనకను, వినుటకైతే వినియు గ్రహింపకయు నుండు టకును అన్నియు ఉపమానరీతిగా వారికి బోధింపబడుచున్నవని వారితో చెప్పెను.
మార్కు 4:11, 2.

## రెండు గాడిదలమీద సవారీచేసిన క్రీస్తు!

ఆ గాడిదను దానిపిల్లను తోలుకొనివచ్చి వాటి మీద తమ బట్టలు వేయగా ఆయన బట్టలమీద కూర్చుండెను. మత్త 21:7.

## ఆపద సమయంలో దేవుడిని ప్రార్థించిన దేవుడు!

ఇంచుమించు మూడుగంటలప్పుడు యేసు, ఏలీ, ఏలీ, లామాసబక్తానీ అని బిగ్గరగా కేకవేసెను. ఆ మాటకు నా దేవా, నా దేవా, నన్నెందుకు చెయ్యి విడిచితి వని అర్థము. మత్త 27:46.

## బొందితో కైలాసం

నేనే ఆయనను అనుటకు నా చేతులను నా పాదములను చూడుడి; నన్ను పట్టిచూడుడి, నాకున్నట్టుగా మీరు చూచుచున్న యెముకలను మాంసమును భూతమున కుండవని చెప్పి....వారిని ఆశీర్వదించుచుండగా ఆయన వారిలో నుండి ప్రత్యేకింప బడి పరలోకమునకు ఆరోహణుడాయెను. లూకా 24:39,51.

## తండ్రిలో కొడుకు, కొడుకులో తండ్రి ఉన్నారట !

నేనును తండ్రియును ఏకమైయున్నాము. యోహా 10:30.

తండ్రియందు నేనును నాయందు తండ్రియు ఉన్నామని నమ్ముడి; లేదా ఈ క్రియల నిమిత్తమైనను నన్ను నమ్ముడి. యోహా 14:11.

## లేచి తిరిగిన శవాలు

సమాధులు తెరవబడెను, నిద్రించిన అనేక మంది పరిశుద్ధుల శరీరములు లేచెను. వారు సమాధులలో నుండి బయటకువచ్చి ఆయన లేచిన తరువాత పరిశుద్ధ పట్టణములో ప్రవేశించి అనేకులకు అగపడిరి. మత్త 27:52,53.

## దేవదూతలున్నారా ?

మనము దేవదూతలకు తీర్పుతీర్చుదుమని యెరుగరా ? 1 కొరిం 6.3.

ఇందువలన దేవదూతలను బట్టి అధికార సూచన స్త్రీకి తలమీద ఉండవలెను. 1 కొరిం 11:10.

## ఆకాశాలు ఎన్ని ?

క్రీస్తునందున్న యొక మనుష్యుని నేనెరుగుదును, అతడు పదునాలుగు సంవత్సరముల క్రిందట మూడవ ఆకాశమునకు కొనిపోబడెను....అతడు పరదైసు లోనికి కొనిపోబడి, వచింప శక్యముకాని మాటలు వినెను; ఆ మాటలు మనుష్యుడు పలుకకూడదు. 2 కొరిం 12:2-4

## విశ్వాస పరీక్ష

విశ్వాసమును బట్టివారు పొడినేల మీద నడిచినట్లు ఎఱ్ఱసముద్రములో బడి నడిచి పోయిరి....విశ్వాసమును బట్టి....యెరికో గోడలు కూలెను.

హెబ్రీ 11:29,30.

## ప్రార్థనలవల్ల రోగాలు తగ్గుతాయా ?

మీలో ఎవనికైనను శ్రమ సంభవించెనా? అతడు ప్రార్థన చేయవలెను; ఎవనికైనను సంతోషము కలిగెనా? అతడు కీర్తనలు పాడవలెను. మీలో ఎవడైనను

రోగియైయున్నాడా ? అతడు సంఘపు పెద్దలను పిలిపింపవలెను. వారు ప్రభువు నామమున అతనికి నూనెరాచి అతనికొరకు ప్రార్థన చేయవలెను. విశ్వాససహితమైన ప్రార్థన ఆరోగిని స్వస్థపరచును, ప్రభువు అతని లేపును; అతడు పాపములు చేసిన వాడైతే పాపక్షమాపణనొందును. యాకో 5:13-15.

## పాతాళంలో నిరీక్షణ

దేవదూతలు పాపము చేసినప్పుడు దేవుడు వారిని విడిచిపెట్టక పాతాళలోక మందలి కటికచీకటిగల బిలములోనికి త్రోసి, తీర్పుకు, కావలిలో ఉంచబడుటకు వారిని అప్పగించెను. 2 పేతు 2:4.

మీ విరోధియైన అపవాది గర్జించు సింహమువలె ఎవరిని మ్రింగుదునా అని వెదకుచు తిరుగుచున్నాడు. 1 పేతు 5:8.

## క్రైస్తవ జ్ఞాన మార్గం

మీలో ఎవనికైనను జ్ఞానము కొదువగానున్న యెడల అతడు దేవుని అడుగ వలెను, అప్పుడది అతనికి అనుగ్రహింపబడును. ఆయన ఎవనిని గద్దింపక అందరి కిని ధారాళముగా దయచేయువాడు. అయితే అతడు ఏ మాత్రమును సందేహింపక విశ్వాసముతో అడుగవలెను. యాకో 1:5,6.

## భూమికి నాలుగు దిక్కులు వున్నాయా ?

భూమియొక్క నాలుగు దిక్కులలో నలుగురు దేవదూతలు నిలిచియుండి.... భూమియొక్క నాలుగు దిక్కుల వాయువులను పట్టుకొనియుండగా చూచితిని.

ప్రక 7:1.

## క్రీస్తును గూర్చి యోహాను వర్ణన

ఏడు సువర్ణ దీప స్తంభములను, ఆ దీప స్తంభముల మధ్యను మనుష్య కుమారుని పోలిన యొకనిని చూచితిని. ఆయన తన పాదముల మట్టునకు దిగుచున్న వస్త్రము ధరించుకొని రొమ్మునకు బంగారు దట్టి కట్టుకొని యుండెను. ఆయన తలయు తలవెండ్రుకలను తెల్లని ఉన్నిని పోలినవై హిమమంత ధవళముగా ఉండెను, ఆయన నేత్రములు అగ్నిజ్వాలవలె ఉండెను. ఆయన పాదములు కొలిమిలో పుటము వేయ బడి మెరయుచున్న అపరంజితో సమానమైయుండెను; ఆయన కంఠస్వరము విస్తార

జలప్రవాహముల ధ్వనివలె ఉండెను. ఆయన తన కుడిచేత ఏడు నక్షత్రములు పట్టు కొని యుండెను, ఆయన నోటినుండి రెండంచులు గలవాడియైన ఖడ్గమొకటి బయలు వెడలుచుండెను; ఆయన ముఖము మహాతేజస్సుతో ప్రకాశించుచున్న సూర్యునివలె ఉండెను. ప్రక 1:12-16.

అగ్నిజ్వాల వంటి కన్నులును, అపరంజిని పోలిన పాదములును గల దేవుని కుమారుడు. ప్రక 2:18.

## ప్రకాశించే దేవుడు

ఈ సంగతులు జరిగిన తరువాత నేను చూడగా .... పరలోక మందు ఒక సింహాసనము వేయబడియుండెను, సింహాసనమునందు ఒకడు ఆసీనుడైయుండెను. ఆసీనుడైనవాడు దృష్టికి సూర్యకాంతపద్మరాగములను పోలినవాడు; మరకతమువలె ప్రకాశించు ఇంద్రధనస్సు సింహాసనమును ఆవరించియుండెను. ప్రక 4:1-3.

## వింత సింహాసనం

ఆ సింహాసనములోనుండి మెరుపులును ధ్వనులును ఉరుములును బయలు దేరుచున్నవి. మరియు ఆ సింహాసనము ఎదుట ఏడు దీపములు ప్రజ్వలించుచున్నవి; అవి దేవుని ఏడు ఆత్మలు. ప్రక 4 : 5.

## పరలోక జంతువులు

మరియు ఆ సింహాసనము ఎదుట స్ఫటికమును పోలిన గాజువంటి సముద్ర మున్నట్టుండెను. ఆ సింహాసనమునకు మధ్యను సింహాసనము చుట్టును, ముందు వెనుక కన్నులతో నిండిన నాలుగు జీవులుండెను. మొదటి జీవి సింహము వంటిది; రెండవజీవి దూడ వంటిది; మూడవజీవి మనుష్యుని ముఖమువంటి ముఖముగలది; నాలుగవజీవి యెగురుచున్న పక్షిరాజు వంటిది. ఈ నాలుగు జీవులలో ప్రతిజీవికి ఆరేసి రెక్కలుండెను, అవిచుట్టును రెక్కల లోపటను కన్నులతో నిండియున్నవి. అవి భూత వర్తమాన భవిష్యత్కాలములలో ఉండు సర్వాధికారియు దేవుడునగు ప్రభువు పరిశుద్ధుడు, పరిశుద్ధుడు అని మానక రాత్రింబగళ్ళు చెప్పుచుండును. ఆ సింహాసనమునందు ఆసీనుడైయుండి యుగయుగములు జీవించుచున్నవానికి మహి మయు, ఘనతయు, కృతజ్ఞతాస్తుతులను కలుగునుగాకని ఆ జీవులు కీర్తించుచుండగా

ఆ ఇరువది నలుగురు పెద్దలు సింహాసనమునందు ఆసీనుడైయుండు వాని ఎదుట సాగిలపడి, యుగయుగములు జీవించుచున్న వానికి నమస్కారముచేయుచు- ప్రభువా, మాదేవా, నీవు సమస్తమును సృష్టించితివి; నీ చిత్తమునుబట్టి అవియుండెను; దానిని బట్టియే సృష్టింపబడెను గనుక నీవే మహిమ ఘనత ప్రభావములు పొందనర్హుడవని చెప్పుచు తమ కిరీటములను ఆ సింహాసనము ఎదుటవేసిరి ప్రక 4:6-11.

మరియు-దేనారమునకు ఒక శేరు గోధుమలని .... ఆ నాలగు జీవులమధ్య ఒక స్వరము పలికినట్టు నాకు వినబడెను. ప్రక 6 : 6.

## దేవుడి గొర్రెపిల్లకు ఏడుకొమ్ములు, ఏడుకన్నులు వుంటాయి!

మరియు సింహాసనమునకు ఆ నాలుగు జీవులకును పెద్దలకును మధ్యను, వధింపబడినట్లుండిన గొర్రెపిల్ల నిలిచి యుండుట చూచితిని. ఆ గొర్రె పిల్లకు ఏడు కొమ్ములును ఏడు కన్నులు నుండెను. ఆ కన్నులు భూమి యందంతటికి పంపబడిన దేవుడి యేడు ఆత్మలు, ప్రక 5 : 6

## దైవభక్తిగల జంతువులు !

ఆ నాలుగు జీవులు-ఆమేన్ అని చెప్పగా ఆ పెద్దలు సాగిలపడి నమస్కా-రము చేసిరి. ప్రక 5:14.

## కొత్తరకం మిడతలు !

ఆ మిడతల రూపములు యుద్ధమునకు సిద్ధపరచబడిన గుఱ్ఱములను పోలి యున్నవి. బంగారమువలె మెరయు కిరీటముల వంటివి వాటి తలల మీద వుండెను; వాటి ముఖములు మనుష్య ముఖముల వంటివి స్త్రీల వెంట్రుకల వంటి వెంట్రుకలు వాటి కుండెను. వాటి పండ్లు సింహపుకోరలవలె వుండెను. ఇనుప మైమరవులవంటి మైమరవులు వాటికుండెను వాటి రెక్కల ధ్వని యుద్ధమునకు పరు గెత్తునట్టి విస్తారమైన గుఱ్ఱపు రథముల ధ్వనివలె ఉండెను. తేళ్ళ తోకలవంటి తోక లును కొండ్లును వాటికుండెను. అయిదునెలల వరకు వాటి తోకలచేత మనుష్యులకు హాని చేయుటకు వాటికి అధికారముండెను. ప్రక 9:7-10.

## ఆశ్చర్యకరుడైన దేవదూత :

బలిష్ఠుడైన వేరొక దూత పరలోకమునుంచి దిగివచ్చుట చూచితిని. ఆయన

మేఘము ధరించుకొని యుండెను, ఆయన శిరస్సు మీద ఇంద్రధనస్సుండెను; ఆయన ముఖము సూర్య బింబమువలెను ఆయన పాదములు అగ్ని స్తంభములవలెను ఉండెను. ఆయన చేతిలో విప్పబడియున్న యొక చిన్న పుస్తకముండెను. ఆయన తన కుడిపాదము సముద్రము మీదను ఎడమపాదము భూమిమీదను మోపి, సింహము గర్జించునట్లు గొప్ప శబ్దముతో అర్భటించెను. ఆయన అర్భటించినప్పుడు ఏడు ఉరుములు వాటివాటి శబ్దములు పలికెను. ప్రక 10:1-3.

## బైబిలు తిని వేయబడిందా !

అంతట నేను ఆ చిన్న పుస్తకమును దూత చేతిలోనుండి తీసికొని దానిని తినివేసితిని; అది నా నోటికి తేనెవలె మధురముగా ఉండెనుగాని నేనుదానిని తిని వేసిన తరువాత నా కడుపుకు చేదాయెను. ప్రక 10:10.

## పరలోకంలో జరిగే అద్భుతాలు

అప్పుడు పరలోకమందు ఒక గొప్ప సూచక కనబడెను. అదేమనగా సూర్యుని ధరించుకొనిన ఒక స్త్రీ ఆమె పాదములక్రింద చంద్రుడును శిరస్సుమీద ప్రండ్రెండు నక్షత్రముల కిరీటమును ఉండెను .... అంతట పరలోకమందు ఇంకొక సూచన కన బడెను. ఇదిగో యెర్రని మహాఘట సర్పము; దానికి ఏడుతలలును పదికొమ్ములును ఉండెను; దానితలలమీద ఏడు కిరీటములుండెను. దాని తోక ఆకాశ నక్షత్రములలో మూడవభాగము నీడ్చి వాటిని భూమిమీద పడవేసెను. కననై యున్న ఆస్త్రీ కనగానే, ఆమె శిశువును మింగివేయవలెనని ఆ ఘటసర్పము స్త్రీ యెదుట నిలుచుండెను. ప్రక 12:1-4.

## పరలోకంలో యుద్ధం

అంతట పరలోకమందు యుద్ధము జరిగెను. మిఖాయేలును అతని దూత లును ఆ ఘటసర్పముతో యుద్ధము చేయవలెనని యుండగా ఆ ఘటసర్పమును దాని దూతలును యుద్ధముచేసిరి ...అపవాదియనియు సాతాననియు పేరుగల ఆది సర్పమైన ఆ మహాఘటసర్పము పడద్రోయబడెను. ప్రక 12:7-9.

## ఏడుతలల చిరుతపులి

మరియు పదికొమ్ములును ఏడుతలలును గలయొక క్రూరమృగము సముద్రములో నుండి పైకి వచ్చుట చూచితిని. దాని కొమ్ముల మీద పదికిరీటములు .... ఉండెను....ఆ మృగము చిరుతపులిని పోలియుండెను. ప్రక 13:1,2.

## గొర్రెపిల్ల పెళ్లి

గొర్రెపిల్ల వివాహోత్సవ సమయము వచ్చినది; ఆయన భార్య తన్నుతాను సిద్ధపరచుకొనియున్నది. ప్రక 19 : 7.